నేడే చూడండి!




శ్రీదేవి ప్రొడక్షన్స్ వారి

# భువనసుందరి కథ

స్క్రీన్‌ప్లే-మాటలు: బి.ఎల్.ఎన్. ఆచార్య · ఛాయ: సి. నాగేశ్వరరావు · కళ: వాలి · కూర్పు: బి. గోపాలరావు

దర్శకత్వం: సి. పుల్లయ్య · సంగీతం: ఘంటసాల · నిర్మాత: తోట సుబ్బారావు

పూర్ణా రిలీజ్

STUDIO

NAVRANG

# పాఠకులకు మనవి

కిందటి వారం సంచికలో "1966 నవలల పోటీ"లో రెండవ బహుమతి పొందిన నవల వివరాలు ఈ సంచికలో వేస్తామని రాశాము. రెండవ బహుమతి పొందిన నవల "పూర్వసంధ్యా ప్రవర్తే" రచయిత్రి శ్రీమతి అధరాపురపు తేజోవతి.

ఆమె పంపిన ఫోటో, జీవిత విశేషాలు ఈ క్రింద ప్రచురిస్తున్నాము:



శ్రీమతి తేజోవతి

"మా స్వస్థలము గుంటూరు ఆంధ్ర విశ్వవిద్యాలయ సారస్వత పట్టము పుచ్చుకున్నాను హిందీ రాష్ట్రభాషా విశారద పట్టము కూడా తీసుకున్నాను ప్రస్తుతము గుంటూరులోని సెంట్ జోసెఫ్స్ బి. ఇడి ట్రెయినింగు కాలేజీలో చదువుచున్నాను.

మా శ్రీ వారు, మరి కొందరు శ్రేయోభిలాషుల ప్రోత్సాహముతో 1960 నుండి కొన్ని రచనలు చేశాను. నేను వ్రాసిన కథలు కొన్ని 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' 'జాగృతి' మొదలగు పత్రికలలో ప్రచురింపబడినవి. కొన్ని రేడియోలో ప్రసారము కాబడినవి. కొన్ని కథలు 'ఎస్. జీ. వో' అను పేరుతో కథల సంపుటిగా వెలువడినది. కలం పేరు 'జ్యోతి.' చిన్నప్పటి నుండి సాహిత్యాభిలాష ఎక్కువ. తీరిక చిక్కినప్పుడు కథలు వ్రాయడం హాబీ మాకు నలుగురు పిల్లలు."

మొదటి బహుమతి పొందిన నవల వివరాలు వచ్చేవారం, 28—4—67 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము ఇంతకి ముందే చెప్పినట్లు పోటీకి చాలా నవలలు రావటం చేత నిర్ణయంలో కొంత ఆలస్యం జరిగింది!

—సంపాదకుడు

# ఉత్తరాలు

### కథలు

"సీతమ్మా—కొడుకూ—కోడలూ" కథ చాలా బావుంది "అవ్వల" మనుమ ఎంచక్కా గుర్తొరిగి రాశారా అనిపించుతుంది సంభాషణలు ఎంతో ఆకర్షణీయంగానూ సంఘటనలు వాస్తవానికి దగ్గరగను ఉన్నాయి కథలో ఓచోట కొంటి లక్ష్మమ్మ గారు సినిమాకు బయలుదేరారన్నారు అప్పుడు సమయం సాయంకాలం 7—30 అయిందని అంతకుముందే అన్నారు మరి ఆవేళప్పుడు ఇంకా సినిమా ఏమిటో? లక్ష్మమ్మ అలాటిది, అని చెప్పేందుకే అలా రాశారేమో!

"అనూహ్యం" కథ బరువుగానే వుంది అయినా సాఫీగా సాగుతూ ఒక్కసారిగా అనుకోని విధంగా మలుపు తీసుకున్నది కథముగింపు నిజంగా అనూహ్యమె అయింది మంజుల పాత్రకు తీరని అన్యాయం చేసి రచయిత చెప్పదల్చుకున్నదేమిటో? రచయితలకు నా అభినందనలు

ఏ బి. అన్సారి (టిట్నాఘర్)

* * *

10—3—67 వ తేదీ సంచిక ముఖచిత్రం బాగుంది రంగధామ్ గారి "సుప్రభాతం" పేరిట చాలా బాగుంది రచయితకి నా హృదయపూర్వక అభినందనలు. యర్రంశెట్టి శాయి గారి "చావు" కథ చక్కగా ఉంది

ఎం శివశంకర రావు (వైజాగ్)

* * *

శ్రీ యస్ యస్ లాల్ గారి చక్కని చిన్న కథ "ఆఖరు ఘడియలు" పకడ్బందీగా వుంది మార్గాలు వేరయినా గమ్యాలు ఒకటే అవే దానికి చక్కని నిరూపణ అవును—మోసపోయినందుకు సంతోషం, వాళ్ళదారికివచ్చినందుకు తృప్తి ఇదే సంఘం. క్రొత్త పంథాలో నడిపించిన శ్రీ లాల్ గార్కి నా ధన్యవాదాలు

ఆర్ గౌరయ్య (హైదరాబాద్)

* * *

10—3—1967న పత్రికలో ప్రచురించిన "రచయిత్రికథ" చాల బాగుంది నాకు కథగా కన్పించ లేదు మానవ జీవితంలో జరిగే సంఘటనల్లో ఇదొకటి సీరియల్ 'జాహ్నవీ హైమవతులు' రసవంతముగాక పడచిన ఆయా కథలు వ్రాసిన రచయిత్రులు రచయితలకు కథలు ప్రచురించిన మీకు హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు

వి వీరప్పయ్య (చీరాల)

### న్యూఢిల్లీలేఖ

31—3—67 వ వారపత్రికలో మిసెస్ సబీనా గారు శ్రీ కృష్ణగారు హిందూమత పక్షపాతి యని విమర్శించారు ఆయన ముస్లింలను దుయ్యబట్టినంతమాత్రాన అట్లు అనరాదు శ్రీకృష్ణగారు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి పదవీ వ్యామోహంతో దురహంకారంగ ప్రవర్తించారని వ్రాశారు. మరి దీనికి ఏమంటారు? శ్రీకృష్ణగారు ప్రతి ప్రముఖ రాజకీయనేతనుగాని, లేక ఏపక్షమైనా సరే వారిలో కనుక లోపములుంటే వాటిని విమర్శించేవారు ఇందువల్ల శ్రీ కృష్ణగారికి మతపక్షపాతము కలదని చెప్పగలమా?

పి. హెచ్. కృష్ణ (ఒంగోలు)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 21—4—'67

ప్లవంగనామసం॥ చైత్రబహుళ ఏకాదశి

సంపుటము : 59 సంచిక : 32

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1

చందా వివరాలు : 10-2-1967 మొదలు

భారతదేశం

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |
| ఒకప్రతి | 0.40 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి శారద.










# పార్టీ, ప్రణాళికలను విస్మరించి విధానాలకోసం అన్వేషిస్తున్న శ్రీమతి గాంధీ

ఫ్రెంచి రాణి మేరీ ఆంటోయినెట్‌ని గురించి ఎమిల్ లడ్విగ్ తన పుస్తకంలో ఈ క్రింది విధంగా వివరించాడు:

“ఆమె వివేక హీనురాలు, చపలచిత్త. తన ఆస్థానంలో ముఖ్యమైన వారందర్నీ వెళ్లగొట్టింది. ఆమెగానీ, మందబుద్ధిగల ఆమె భర్త 16వ లూయీస్ గానీ, అనేకంగా ఉన్న ఆస్థానంలోని సభ్యులుగానీ కొత్త శాసనసభ యొక్క అత్యవసర ప్రాముఖ్యతను గుర్తించి పట్టించుకోవడానికి అయిష్టతను ప్రదర్శించేవారు.”

1789లో ఇది ఫ్రాన్స్‌లో జరిగిన ఉదంతం.

మేడమ్ గాంధీకి వివక్షగా శక్తి లేక పోవచ్చునేమోగానీ ఆమె చపలచిత్త మాత్రం కాదు. ముఖ్యమైన వారందర్నీ ఆమె బహిష్కరించలేదు. కానీ దేశాన్ని అలముకొన్న ఆందోళనాపూరిత వాతావరణాన్ని పట్టించుకోని ఆస్థానం మాత్రం ఆవిడ కున్నది. బయటివారిని కూడా తీసుకువచ్చి తన స్థానాన్ని పటిష్టం చేసుకునే వరకే ఆమె పట్టించుకొంటున్నారు. ప్రధానమంత్రిగా ప్రమాణస్వీకారం చేసినప్పటి నుంచి ముగ్గురు ఆమె కూటమిలో ఉన్నారు. వారు శ్రీయుతులు దినేష్‌సింగ్, ఇందర్ గుజ్రాల్, రమేష్ థాపర్‌లు. ప్రస్తుతం దినేష్‌సింగ్ కాబినెట్ హోదాలో ఉన్న మంత్రి, ఇందర్ గుజ్రాల్ స్టేట్‌మంత్రి ఇక ఈ వర్గంలోని మూడవ వ్యక్తి శ్రీ రమేష్ థాపర్ గారిని కూడా అన్యాయంగా వదిలేశారు. కానీ యిప్పుడు ఆయన పేరును స్టేట్‌మంత్రిగా ప్రతిపాదించ నున్నారు.

మరోవైపు మనకు ప్రధానులుగా వచ్చిన ముగ్గురి స్వరాష్ట్రం అయిన ఉత్తరప్రదేశ్‌లో కాంగ్రెస్ దెబ్బతిన్నది. ఇప్పుడు హౌరా నుంచి అమృతసర్ రైల్లో ప్రయాణం చేసే వ్యక్తి తాను కాంగ్రెస్ పరిపాలనలేని ప్రాంతాలలో నుంచి ప్రయాణిస్తున్నాననే సంతృప్తిని అనుభవించవచ్చు. ‘సంతృప్తి’ అన్న మాట ఎందుకన్నానంటే ఉత్తరప్రదేశ్‌లో గుప్తా మంత్రివర్గం పడిపోయిందని తెలియగానే జనం తమ ఆనందోత్సాహాలను ప్రదర్శించినట్లు లక్నో, ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన వార్తలను బట్టి తెలిసింది. చిన్నచిన్న పట్నాల్లో కూడా మిఠాయిలు, కిళ్లీలు అమ్మేవారు తమవద్ద ప్రజలు కొన్న మిఠాయిలకు, కిళ్లీలకు డబ్బు తీసుకోడానికి నిరాకరించారు.

తన స్వరాష్ట్రంలో కాంగ్రెస్ పతనం అన్నది మేడమ్ గాంధీపై ఎలాంటి ప్రభావాన్ని చూపింది? ప్రస్తుతం విధానాల గురించి ఆలోచించాలి కానీ పార్టీ గురించి కాదు అన్నారామె.

మొట్టమొదట ఆమె స్థానం ఒక పార్టీకి చెందినది. అది కాంగ్రెస్. తనకు తానుగా ఆమె ప్రధానమంత్రి కాలేరు. కాంగ్రెస్‌కి కేంద్రంలో మెజారిటీ రావటం మూలంగా ఆమెను కాంగ్రెస్‌వారు తమ నాయకురాలిగా ఎన్నుకున్నారు కాబట్టే ఆమె ప్రధాన మంత్రి కాగలిగారు. ఇక రెండోది ఆమె చెప్తున్న విధానం ఏమిటి? ఆమె తండ్రికి కూడా కొన్ని నిర్దుష్టమైన విధానాలుండేవి. అలానే ఆమెకు ముందు ప్రధాన మంత్రిగా ఉన్న లాల్‌బహదూర్ శాస్త్రి గారికి కూడా ఉండేవి. జనవరి 1966నుంచి అంటే ఆమె ప్రధానిగా ఎన్నికైనప్పటి నుంచి ‘ప్రజాస్వామ్య సామ్యవాదం’ అన్న పదం మేడమ్ గాంధి నిఘంటువులో నుంచి తుడిచి పెట్టుకుపోయింది. (ఒకప్పుడు ఆమెకూడా తీవ్రవాదుల ముఠాలోనివారే.) దానికి బదులు ఆమె మంత్రివర్గం రాజాలతో, జమీందార్లతో అలంకృతమైంది. ఆమెగారి డెప్యూటీ మంత్రులలో ఒకరికి పులివేట సరదా అట!

ప్రణాళిక అన్నది పూర్తిగా ఎత్తివేయబడింది. వరండాల్లో కంటికి కన్పించినంత వరకూ గుసగుస ధ్వనులు కేంద్రంలో విన్పిస్తున్నాయి.

అయినా యింకా మేడమ్‌గాంధి ప్రశాంతంగా, నెమ్మదిగా కూర్చిన విధానాలను గురించి మాట్లాడుతున్నారు. కానీ అవి ఆచరణ శూన్యమైనవే. కాబినెట్‌లోని కలకలం గుసగుసల ద్వారా బహిర్గతం అవుతూనే వుంది.

* * *

శ్రీ మొరార్జీ దేశాయ్ హిందీనిగురించి మాట్లాడుతూ శత్రువుల్ని పెంచుకుంటుంటే మేడమ్ గాంధీ హిందీగురించి మాట్లాడకుండానే దాన్ని అమలు జరుపుతున్నారు. దీనికి ఢిల్లీ టెలివిజన్ కేంద్రం ఒక తార్కాణం. ఇది హిందీ వారిచేత, హిందీవారితో, హిందీవారి కోసం ఏర్పాటు చేయబడినట్లున్నది. తెర మీద కనపడే అన్ని ప్రకటనలు దాదాపు గ్రాంధికమైన హిందీలో జరుగుతాయి. అంతంతమాత్రంగా హిందీ తెలిసిన మా విలేఖరి లాంటి వారికి అవి అర్థం కావు. తెర మీద చూపే వాటిలో ఔషధాలుగా ఉపయోగపడే ఆధరవులు, టైఫాయిడ్ మొదలైన రోగాల నివారణకు సలహాలు, ఈ సేవను ప్రస్తుతిస్తూ వచ్చే ఆత్మస్తుతి ఉత్తరాలు ఉంటుంటాయి.

ఢిల్లీలో అన్నిరాష్ట్రాలకు చెందిన రకరకాల ప్రజలు ఉన్నారు కాబట్టి హిందీయేతర ప్రజలకు ఈ టెలివిజన్ ప్రయోజన శూన్యంగా ఉంది. ముఖ్యంగా ఢిల్లీలో

అధిక సంఖ్యాకులుగా ఉన్న పంజాబీలకు కూడా యిది నిరుపయోగంగానే ఉంది. అయితే ఈ ఖర్చు అంతా పన్నులు కడుతున్న భారత పౌరుడే భరిస్తున్నాడు. ఇది ఈనాటిది కాదు. మేడమ్ గాంధి లాల్‌బహదూర్ శాస్త్రిగారి మంత్రివర్గంలో ఉన్నప్పటి నుంచీ ఆమెకు యిదో 'సరదా' అయింది.

* * *

లోక్‌సభ కొత్త స్పీకర్ శ్రీ సంజీవరెడ్డి రూపు దిద్దుకొంటున్నారు. ఆయన స్వాతంత్ర్యానంతరం వచ్చిన స్పీకర్లలో అత్యుత్తముడుగా రూపొందగల అవకాశం ఉంది. ఆయన స్థిర నిశ్చయం కల వ్యక్తి. నిర్ణయాలు తీసుకోడంలో నిశ్చితమైన దృక్పథం ఉన్నది. అంతకు ముందున్న స్పీకర్ అమలులోకి తెచ్చిన లోక్‌సభలోని "బేర్ లవర్"ను రద్దు చేయటంలో ఆయన సఫలీకృతులైనారు. అప్పుడే ఆయన ప్రతిపక్షం వారి అభిమానాన్ని చూరగొన్నారు. ఒక్కొక్కప్పుడు చెడగొట్టుకుంటున్నారు కూడా. ప్రశ్నా సమయంలో ఎన్నికల ఖర్చుల విషయాన్ని ప్రస్తావిస్తూ అభ్యర్థులు న్యాయసమ్మతంగా చేయవలసిన ఖర్చు కంటె ఎక్కువగా ఖర్చు చేశారని ప్రతిపక్షం వారు ఆరోపించారు. న్యాయశాఖామంత్రి దాన్ని ఖండించడానికి పూనుకొనగా స్పీకర్ కల్పించుకొని అది అందరకూ ఎరిగినవిషయమేనని, ఎల్లరకూ మామూలుగా అనుసరిస్తున్న పద్ధతేనని చెప్పగానే సభలోని వారంతా ఘొల్లున నవ్వారు. అనంతరం ప్రతిపక్షంవారు యిక తామడగవలసిన ప్రశ్నలేవీ లేవని అన్నారు. సభ్యులను వారివారి మాతృభాషల్లో మాట్లాడ్డానికి అనుమతించి హిందీ ఆధిపత్యాన్ని అంతం చేశారు.

తను కిచ్చిన హోదాలన్నిటిలో శ్రీ రెడ్డి తన పాత్రను చక్కగా నిర్వహించి దేశానికి సేవ చేశారు. రెడ్లు వీరుల కోవకి చెందిన వారు కాబట్టి అధికారం గల ఏ స్థానాలకైనా వారు తగినవారు. శ్రీ సంజీవరెడ్డి తమకు తగిన స్థానాన్ని పొందగలరు. ఆయనకి అధికారాన్ని ఎలా చెలాయించాలో తెలుసు. దాన్ని ఆయన తెలివితేటల్తో సమర్థతతో నిర్వహించారు.

* * *

స్వెట్లానాను గురించిన వివాదం యింకా సమసిపోలేదు. మేడమ్ స్వెట్లానా నుంచి తమకు ఓ లేఖ వచ్చిందని డాక్టర్ రామ్ మనోహర్ లోహియా లోక్‌సభలో అన్నారు. ఆయన, స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ మసానీ కలిసి వచ్చేవారం లోక్‌సభలో ప్రశ్నలను లేవదీయడానికి ఎదురు చూస్తున్నారు. విదేశ వ్యవహారాలమంత్రి శ్రీ చాగ్లా వ్యవహారాన్ని సరిగా నిర్వహించ లేదు. అది భారతదేశానికి రష్యాతో చిక్కుల్ని తెచ్చిపెట్టటమే గాకుండా నల్గురిలో నవ్వులపాలు అయే పరిస్థితిని కల్పించింది. వాస్తవంగా చెప్పాలంటే ప్రపంచ దేశాల్లో కీర్తిశేషులైన నెహ్రూ భారత దేశానికి తీసుకొచ్చిన గౌరవ ప్రతిష్ఠలను గంగపాలు చేసింది. సమానమైన సామర్థ్యం కల కార్యదర్శి శ్రీ పి. ఎస్. ఝా సహాయం ఉన్నా కూడా. సర్దార్ స్వరణ్ సింగ్, చాగ్లాల హయాంలలో ఈ పరిస్థితి ఏర్పడింది. అప్పుడప్పుడు శ్రీ చాగ్లా చేసే ప్రకటనలు, ఆయన అధికార ప్రతినిధి చెప్పే కుప్పి వ్యాఖ్యానాలను చాలా అరుదుగా విదేశీ పత్రికలు గుర్తిస్తున్నాయి. అవి ఉద్రేకపూరితంగా భారత విదేశ కార్యాలయాల గురించి, దాని మంత్రిని గురించే ఉటంకిస్తుంటాయి. పార్లమెంట్‌లో కూడా విదేశ వ్యవహారాల పట్ల ఆసక్తి నశించింది. భారతదేశానికి వచ్చే అధికార ప్రతినిధుల హోదాలను బట్టి ప్రపంచదేశాలలో భారత దేశం ప్రతిష్ఠ ఎంత దిగజారిపోయిందో విశదం అవుతున్నది. అమెరికా అధ్యక్షుడు, రష్యా ప్రధాని, ఇంగ్లండ్ రాణి కాదు భారత దేశం ఆహ్వానాన్ని పురస్కరించుకొని వచ్చేవారు, ఇరాన్ విదేశాంగ మంత్రి లాంటివారే.

* * *

ఢిల్లీ ఆంధ్రసంఘం వారు ఆంధ్రదేశం నుంచి ఎన్నికైన పార్లమెంటు సభ్యులందరికీ ఓ రిసెప్షన్‌ను ఏర్పాటు చేశారు. లోక్‌సభ స్పీకర్ శ్రీ సంజీవరెడ్డి, భారత ప్రధానన్యాయమూర్తి శ్రీ కె. సుబ్బారావు, కేంద్రమంత్రులు డాక్టర్ చెన్నారెడ్డి, డాక్టర్ కె. ఎల్. రావు, శ్రీ బి. ఎస్. మూర్తి, ఉత్తరప్రదేశ్ గవర్నర్ శ్రీ బి. గోపాలరెడ్డి హాజరైన వారిలో ముఖ్యులు.

సంఘం అధ్యక్షులు డాక్టర్ ఎస్. భగవంతం సభికులకు స్వాగతం పలికారు. డాక్టర్ చెన్నారెడ్డి మాట్లాడుతూ ఆంధ్ర ప్రభుత్వం, సంఘం భవనం నిర్మించు కోడానికి ఆంధ్రా గెస్టు హౌస్ ఆవరణలో నున్న కొంత భూమిని యివ్వడానికి ఒప్పుకున్నట్లు తెలిపారు. ●

## లోకం పోకడ

పదిహేను నెలల కాలంలో కేంద్రంలో ఉమ్మడి ప్రభుత్వం ఉండవచ్చు. అది శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ మనూ మసానీల ఉమ్మడి ప్రభుత్వం అవుతుందనుకోండి—జన సంఘం వారు సాదరంగా చూస్తూ ఉంటే.

31—3—67 'నవ్' పత్రికలో చరణ్ గుప్త

* * *

ఆయన (శ్రీ కామరాజ్) తక్కిన జాతీయ నాయకులవలె దేశభక్తి వల్ల పాఠశాల వదల లేదు, విద్యాభ్యాసం పట్ల ఆయనకి ఆసక్తి కలగలేదు.

2—4—67 'స్టేట్స్‌మన్' గ్రంథసమీక్షలో

* * *

—(కాంగ్రెసు) సంస్థలోని 'ముసలి పీడ'లు ఆ సంస్థ మెడమట్టూ గుది బండగా తయారయి పోయారు. ఆ సంస్థకి ఎంతో నష్టం కలిగిస్తున్నారు. 'ఇప్పటికీ, ఆలస్యం అయినా కామరాజు ఈ ముసలి పీడలని బయటికి తన్ని పంపించి సంస్థని రక్షించ గలడు.

—'బ్లిట్జ్' 8—4—67

* * *

—"ఆయన (డా. లోహియా)కి పెళ్ళి కాలేదు. ఆయనకి తెలీదు," శ్రీమతి తారకేశ్వరీ సిన్హా—"మీరు ఆ అవకాశం నాకు ఎప్పుడు ఇచ్చారు?" డా. లోహియా.

—5—4—67 లోక్‌సభలో

* * *

—ప్రభుత్వానికి ఆదాయం ఇస్తాయి కాబట్టి గుర్రపు పందేలు ఉండాలని మేము అనటం లేదు. గుర్రపు పందేలు ప్రజలకి ఆనందం చేకూరుస్తాయి కాబట్టి ఉండాలి, మితంగా మద్యపానం ఎలా ఉండాలో అలాగ.

—8—4—67 'కరెంట్' వారపత్రిక.




ALL THE TOP HOODS IN THE STATES ARE COMING!

Present

Helmut M. Springer..... The Purple Gang. Detroit.

Jed Midnight........Shadow Syndicate. Miami and Havana.

Billy (The Grinner) Ring......The Machine, Chicago.

Jack Strap......... The Spangled Mob. Las Vegas.

Mr Solo........Unione Siciliana.

Miss Pussy Galore...... The Cement Mixers. Harlem, New York City.




ఆ మధ్యాహ్నం, గోల్డ్‌ఫింగర్ తన ముఠాతో సమావేశం జరుపుకున్నాడు. సమావేశం కార్యక్రమం కాపీలు తయారు చెయ్యమన్నాడు బాండ్‌ని.

"ఏమి ముఠా! టిల్లీ, ఈ పేర్లు చూడు..."

అమెరికాలో పెద్ద దొంగలంతా వస్తున్నారు! హెల్మట్ ఎం. స్ప్రింగర్...పర్పుల్ గాంగ్, డిట్రాయెట్ — జో మిడ్నయిట్ ... షాడో సిండికేట్, మియామీ, హవాన — బిల్లీ (ది గ్రిన్నర్) రింగ్.. ది మెషీన్, షికాగో...జాక్‌స్ట్రాప్...ది స్పాంగిల్డ్ మాచ్, లాస్‌వెగాస్— మిస్టర్ సోలో...యూనియోన్ సిసిలియానో—మిస్‌పుస్సీగలోర్ ... ది సిమెంట్ మిక్సర్స్, హార్లెమ్. న్యూయార్క్ సిటీ.

'ఇక కార్యక్రమం— ఇదేదో 'గ్రాండ్ స్లామ్' అనే మారు పేరున్న పని.'










మధ్యాహ్నం రెండుఇరవయ్‌కి బాండ్, టిల్లీలు 'ఆపరేషన్ గ్రాండ్ స్లామ్' ప్రథమ సమావేశానికి వెళ్ళారు.

"కార్యక్రమమేనా? మంచిది, మిస్ మాస్టర్టన్, చర్చలో వచ్చే పాయింట్లని నోట్ చేసుకోవాలి..."

"అలాగే!"

"మిస్టర్ బాండ్! ఇక్కడ మాటాడేవారి వాలకం గమనించండి:..వెనక్కి తగ్గే వాళ్ళ పని చూసుకుందాములెండి..."

"కాని, కొందరి సంగతి అనుమానమే. ఒక ద్రోహి ఉంటే చాలు, అందరం జెయిలుకి వెళ్ళిపోతాము..."










సరిగ్గా రెండున్నరకి బజ్జర్ మోగింది. అమెరికాలోని అయిదుగురు దొంగల నాయకులూ గోల్డ్‌ఫింగర్‌ని జాగ్రత్తగా, ముభావంగా చూస్తూ

"నా పేరు గోల్డ్‌ఫింగర్, దయచేసి కూచోండి..."

"ఈ సమావేశంలో నోట్సు తీసుకోము. ఎక్కడా మైక్రోఫోన్లు లేవు. ఇక నా సెక్రెటరీలని పరిచయం చేస్తాను..."










ఇంత భయంకరమయిన మొహాలని తను సాధారణంగా చూసి ఉండననుకున్నాడు బాండ్, అందరినీ కలయజూసి.

"నా సెక్రటరీల పేర్లు.. జేమ్స్‌బాండ్, టిల్లీ మాస్టర్టన్..."

"మిస్ గలోర్ వచ్చేదాకా మీ పేరు ఒక్కొక్కటే వాళ్ళకి చెప్తాను..."

"మరొకమాట—మీ ఒక్కొక్కరి ముందూ ఒక పొట్లం వుంది. ప్రతి పొట్లంలో మీ పదిహేనువేల డాలర్లు విలువచేసే బంగారు కడ్డీ ఉంది. మీ ఖర్చులకి సరిపోయేందుకు..."










గోల్డ్‌ఫింగర్ క్రమంగా అందరినీ బాండ్‌కి పరిచయం చేశాడు. బాండ్ నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు.

"మిస్టర్ బాండ్ మీ కుడివైపునున్నది మియామీ, ఫ్లోరిడాల షాడో సిండికేట్‌కి చెందిన మిస్టర్ జెడ్ మిడ్నైట్..."

"తర్వాత షికాగో 'మెషీన్' అధిపతి మిస్టర్ బిల్లీ రింగ్, డెట్రాయిట్ పర్పుల్ గాంగ్ అధిపతి మిస్టర్ హెల్మట్ స్ప్రింగర్..."

"..యూనియోన్ సిసిలియానోకి చెందిన మిస్టర్ సోలో—"

"...అమెరికాలోని మాఫియా నాయకుడు! భయం, బలం రెండూ కావాలి..."










"లాస్‌వెగాస్‌లోని 'ది స్పాంగిల్డ్ మాబ్'మనిషి మిస్టర్ జాక్ స్ట్రాప్..."

బాండ్‌కి తర్వాత గోల్డ్‌ఫింగర్ చెప్పిన మాటలు సరిగ్గా వినిపించలేదు. తలుపువంక చూస్తూ ఉండిపోయాడు...

"హౌడీ..."

"మిస్ గలోర్ పరిచయాలిప్పుడే పూర్తి అయ్యాయి—"

"హాయ్—"

ఈ అమ్మాయి హార్లెమ్‌లో 'ది సిమెంట్ మిక్సర్స్' అనే ముఠా నాయకురాలా? అనుకున్నాడు బాండ్...

(ఇంకా వుంది)

# మట్టిబొమ్మలు



సీరియల్

తాడిగిరి పోతరాజు

## 2

మధ్య గది తలుపులు చివాలున తెరచుకొన్నాయి. వెంకట్రామయ్య ధర్మపత్ని ఏడుస్తూ ఆతని పాదాల చెంత, మంచం కోడుపై కూలబడింది.

రోగి మూల్గుతూ ప్రక్కకు కదిలాడు. 'అమ్మా' అంటూ మాష్టారు ఆమె వైపుకి వంగి ముఖంలోకి చూశారు. ఆమె లేచి నిలబడి ఆందోళనగా చూసింది.

"రేపు వాళ్ళొస్తున్నారుగా..పిల్లలిద్దరూ వస్తే".. దుఃఖపు తెర అడ్డమొచ్చి మాటలాగిపోయ్యాయి. కళ్ళు మూసికొని పోయ్యాయి. ఒకనిముషం ఆగిమళ్ళీ పెదవులు కదిలాయి.

"వస్తే చూసి" మాటలు పూర్తి చెయ్యలేకపోయ్యారు. చేతగాళ్ళతో సహా అందరూ ఒకరి ముఖాలొకరుచూసుకొన్నారు. అతని మాటలు అర్థం కానట్లు — ఓక్షణ మాగి ఆమె అంది.

"అబ్బాయి రేపొస్తాడు.. ఈవాళ బండి అందుకుంటే ఈ రాత్రికే గుంటూరు రావాలి... బాబ్బుగూర్చి దిగులుపడకండి" ముక్కు చీదుకొంటూ ముగించింది.

"వాడుకాదు..వాడు.. పెద్దాడు.. వాడి కోసం కబాడ గుంటూరు మనిషిని పంపించారా?" బాధగా మూల్గుతూ తల విసురుకోవటం మొదలెట్టాడు.

ఒక్కక్షణం అందరూ అచేతనుల్లా చూస్తూ నిలబడిపోయ్యారు. సమాధానం కోసమై నిరీక్షిస్తూన్న అతని కళ్ళు బాధగా మూసికొనిపోయ్యాయి. కొద్ది క్షణాల్లో స్పృహతప్పిపోయింది. మాష్టారికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. కిటికీ రెక్క విరిచి డాక్టర్ కోసం నిరీక్షిస్తూ బయటికి చూశాడు.

"దేవుడు మాకే కష్టాలు ఎందుకు పెట్టాడో నమ్మా" అంటూనొసలు కొట్టుకొంటూ బిగ్గరగా ఏడ్వసాగింది.

"మీరు కంగారు పడకండి అచ్చమ్మగారూ.. అదే తగ్గిపోతుంది.. డాక్టర్‌గారు ఈ పాటికి వస్తూ ఉండవచ్చు." ఓదార్చటానికి ప్రయత్నిస్తూ మాష్టారు అన్నాడు.

ఆకాశాన్ని ముక్కలు ముక్కలుగా చీలుస్తున్నాయి మెరుపులు. చిరిగిన ఆకాశం మళ్ళీ అతుక్కుపోతోంది. జగత్తునంతా చీకటి కామంలా కౌగిలించుకొంది. అంతా గబ్బ్రగియు. ఆ చీకట్లో 'లపలప' లాడుతున్న బురదలో, చేతాంతరు వెలుగుతో కాళ్ళు విలంగా చీక్కొంటూ మనుష్యులు నడుస్తున్నారు.

మాష్టారి ప్రాణం లేచి వచ్చింది. పెద్ద పెద్ద అంగలు వేసి కొంటూ, వాకిలి దాటి మెట్ల వరకూ నడిచాడు.

"డాక్టరుగారొస్తున్నారా?" అంటూ లేచి నిలబడింది అచ్చమ్మగారు. చీర చెరుగుతో కళ్ళు వత్తుకొని ప్రక్కకు తిరిగింది.

డాక్టర్ వానకోటును భుజాల నుండి తొలగించుకొంటూ ప్రవేశించాడు, మాష్టారు దాన్ని అందుకొని తలుపుకు తగిలించారు.

"వేడినీళ్ళు ఉంచమన్నాను. ఉంచారా?" అంటూ మంచం దగ్గరగా స్టూలు లాక్కున్నాడు. రెండు నిముషాల సేపు పరీక్షించి సూదిమందిచ్చాడు. దూదితో సూది గుచ్చిన స్థలాన్ని రుద్దుతూ "ఇవాళకేం ఫర్వాలేదు. కంగారు పడకండి.. నేను చెప్పినట్లు ఈ 'టాబ్లెట్స్' మాత్రం ఇస్తూ ఉండండి" అన్నాడు. సీసా మూత తీశాడు డాక్టర్. లైటు దగ్గరగా పట్టుకొచ్చాడు చేతగాడు.

బయట వాన తగ్గుముఖంపట్టింది. పెడగాలి వీచ సాగింది. మెరుపు తగ్గిన రాళ్ళల్లో మిణుకు మిణుకు మంటూనే, చుక్కలు కిటికీకి ఎదురుగా కనిపిస్తున్నాయి.

"ఆదుర్దా పడవలసిన పనేమీ లేదంటారా? అంటూ డాక్టర్ని గడప వరకూ సాగనంపిన మాష్టారు రోగి పైన శాలువా సరిగా కప్పసాగాడు

అందమైన స్త్రీ వాల్గంటి చూపుల్లా మెరుపులు. వెళవెళ మంటూ ఎక్కడో పిడుగు పడింది ఉరుము. వెంకట్రామయ్య మెల్లగా ప్రక్కకు కదిలాడు. నీరసంగా పెదవులు విచ్చుకొన్నాయి.

"పిల్లలు రేపు వస్తారు కదూ? రేపటి వరకూ.. నేను.. నేను' అందరి ముఖాల్లో కన్పించిన ఆనందం ఇట్టే అంతర్ధానమైంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"రేపు పిల్లలు తప్పక వస్తారు. మీరు స్థిమితంగా నిద్రపోండి'.. అంటూ ప్రక్కకు తిరిగి అచ్చమ్మగారిని ఉద్దేశించి "మనం ఎదురుగా ఉంటే అలానే మాట్లాడుతారు. మీరువెళ్ళి నిద్రపోండి' అన్నాడు.

"అయ్యో. ఇంకేం నిద్ర.. నా బొంద" ఏడుస్తూ ఆమె లోనికెళ్ళింది. మాష్టారు రోగి ప్రక్కనే ఉన్న మంచంపై వత్తిగిలాడు. చేతగాళ్ళు అప్పటికే మునగిడ తీసుకొన్నారు.

టిక్కు టిక్కు మంటూ గోడ మీద గడియారం గుండె, నిరవంగా మ్రోగిపోవ సాగింది. గప్పుగప్పుమని అదిరిపడిన వాంతరు మళ్ళీ కొరుడుగట్టి పోగ రాజుకొంటూ అవస్థ పడుతోంది. యమవాహనాన్ని స్మృతికి తెచ్చేస్తూ బయట మేస్తూన్న పశువుల మెడలో గంటలు— ఒక్కొక్క చినుకు మళ్ళీ ఆకాశం నుండి తెగిపడ సాగింది.

* * *

కరకరమని పొద్దుపొడిచింది. గత మూడు

రోజుయినా వానే కురవపోని సిరెంట పేడు తోంది. గాలి, ఎండ తగలటాన, రొమ్ము రొమ్ముగాఉన్న పిధులుగట్టిపడిపోయి కొద్దిగా కాలిబాట పడింది తొక్కిడికి. కాలిబాటపై జాగ్రత్తగా నడుచుకొంటూ ప్రాకికి కొద్దిగా ఎడంగా ఉన్న మేడ ముందు ఆగాడు అతను.

సన్నగా పొడుగ్గా ఉన్నా ఇరవై సంవత్సరాల కుర్రవాడు. వయస్సుకు మించిన గంభీరత ప్రశాంతత ముఖంలో ద్యోతకమవుతోంది. తరచి చూస్తే కళ్ళలో గూడుకట్టుకొన్న వైరాగ్యం ప్రస్ఫుటమవుతుంది.

పరీక్షగా మేడ నలుతటవి కలయచూశాడు.

పగిలిన సీసపు ముంకులు గుచ్చిన ఎత్తయిన ప్రహారీ గోడ. గోడ వెనుక ప్రాచీనమైన మేడ. పురాతన పద్ధతిలో ప్రాజులతో దిద్దబడి దాదాపు శిథిలావస్థలో ఉంది. కుడివైపు గోడ పగుళ్ళు చూపింది. పగుళ్ళలో ఒక చిన్నరావి మొక్క కూడా మొలిచింది. వానకు తడిసిన సున్నపు గోడలు ఉదయభాస్కరుని కాంతిలో పొడలు పొడలుగా తెల్లబారుతున్నాయి. అంత పెద్ద ఇల్లు నిర్జనంగా కళావిహీనంగా దిబ్బాడిపుంటోంది.

ఆ ప్రహారీకి పెద్ద ఇనుప చువ్వల గేటు. గేటుకు ఇరువైపులా రెండు సింహాలు నోరు తెరుచుకొని ఉన్నాయి గంభీరంగా. ఒక సింహానికి పంజా విరిగిపోయింది. మరో సింహానికి పెదాలి వద్ద సున్నం రాలిపోయింది.

అతను వంగి బురద అంటుకోకుండా పైకి మడచుకొన్న లాగును గిలకల వరకూ పొడుగు చేసుకున్నాడు. ముఖాన్ని చేతి గుడ్డతో తుడుచుకొని గేటుపై చెయ్యి వేశాడు. తుప్పుపట్టిన గేటు బార్లా తెరుచుకొంది కిర్రుమంటూ.

"అరే.. పొద్దుటేటే వాడివడ్డావ్ మేమింక మవ్వ మద్దెవాల జిప్పాలి యహాల కొత్తాననుకొంటున్నాం" అంటూ శీతగాడు పశువుల చావిటిలో నుండి పల్కరించాడు.

"ఘమ్ముబిప్పుకేవచ్చా..నీకెక్కడున్నాయ్" కొన్నకున్న బురద కేసి చూసుకొంటూ అన్నాడు.

"అదుగో" అరుగుపై పెట్టిన గంగాళం కేసి చూసెట్టాడు వాడు. కాళ్ళు



శుభ్రంగా కడుక్కొని మళ్ళీ హాలు దాటి ప్రక్క గదిలో కెళ్ళాడు.

"నమస్కారమండీ" చేతులెత్తి వినయంగా మాస్టారి కేసి, వెంకట్రామయ్య గారి కేసి తిరిగాడు. మాస్టారి ముఖం ఆనందంతో విప్పారింది. వెంకట్రామయ్య గారు కళ్ళప్పగించి తేరిపార చూసి.

"వచ్చావా నాయనా..రా" అని ఎక్కడో నూతిలో మాట్లాడినట్లు పలికాడు. లోతుగా పడిపోయిన అతని చెంపలపై పుల్లలు పుల్లలుగా పొడుచుకొచ్చిన గడ్డం, గుంటలు పడిపోయిన కళ్ళు చూసి అతను నిరుత్తరుడయిపోయాడు. కొద్ది సేపటికి తేరుకొని దగ్గరున్న స్టూలు మంచం ప్రక్కగా లాక్కున్నాడు.

"అక్కడకాదు—నా దగ్గర కూర్చో"... ఇక్కడ, అన్న అర్థం స్ఫురించేలా, వెంకట్రామయ్యగారు మంచం పట్టెపై తట్టి సైగ చేశాడు. అక్కడ కూర్చోటానికి అతను కొద్దిగా తటపటాయించాడు.

"ఫర్వాలేదు ప్రసాద్...... కూర్చో" మాస్టారు చెప్పాడు. అంతలోనే గృహిణి లచ్చమ్మ స్నానం ముగించుకొని అక్కడికి వచ్చింది. రూపాయంత కుంకుమబొట్టు నొసట దిద్దుకొని, తడిగా ఉన్న వెంట్రుకలను జారు ముడి వేసికొని వచ్చింది.

ఆ విధంగా అతను చొరవతో మంచంపై కూర్చోవటం చూసి ఆమె కళ్ళు విప్పారాయి. గ్రద్దను చూసిన కోడిపిల్లలా అతన్ని చూపు తనపై పడీపడకముందే లేచి నిలబడ్డాడు.

"నమస్కారమండీ" చేతులు రెండూ జోడించాడు.

ఆమె ప్రతినమస్కారం చెయ్యకుండా అతని కేసి నిర్లక్ష్యంగా చూసి "ఫస్టు బస్‌కే వచ్చావా?.. సరే.. ఇక్కడ కూర్చో", అంటూ ఆమె స్టూలు చూపెట్టింది.

"అక్కర్లేదండీ" అంటూ గోడకానుకొని నిలబడిపోయాడు.

మాస్టారు జానెడు గ్లాసుతో మందు పోసి, ఆ గిలాసపై బొటనవ్రేలు పెట్టి కిటికీ ఎదురుగా నిలబడి దాన్ని పరీక్షగా చూస్తున్నాడు. వెంకట్రామయ్య గారు బాధగా మూలుగుతూ ప్రక్కకు తిరిగి "నేనే...నేనే... కూర్చోమన్నాను" అంటూ దగ్గరగా రమ్మని సైగ చేశాడు.

# మట్టి బొమ్మలు

"సంతులుగారూ.. వేడినీళ్ళు ఇక్కడ పెట్టించాను.. వారిని మెల్లగా లేవతీసి ముఖం కడిగించుతారా" ఆమె గోడ ప్రక్కకు తిరిగి అంది.

"మంచిది".. మందు పోసిన జానెడు గ్లాసు అక్కడ పెట్టి వెంకట్రామయ్య గారిని లేవదీయటానికి ఉద్యుక్తుడయ్యాడు.

"మీరుండండి మాస్టారూ.. నేను కూర్చోబెడతాను" ప్రసాద్ అన్నాడు.

"నీకు అలవాటు లేదుగా. నీవాగు— నేను మెల్లగా లేపి వారి వెనుక ఆసరాగా కూర్చుంటాను. నీవు ఆ బొక్కెన మంచం దగ్గరకు జరిపి వేడినీళ్ళతో ముఖం కడుగు"

మాస్టారి చేతిపై ఒక చెయ్యి ప్రసాద్ చేతిపై మరో చెయ్యి వేసి, వెంకట్రామయ్య గారు లేవటానికి ప్రయత్నించాడు. కొద్దిగా పైకి లేపి వీపు క్రింద చెయ్యి వేసి సున్నితంగా కూర్చోపెట్టాడు ప్రసాద్. ఆ పిదప మాస్టారు ఆసరాగా ఆనుకొని కూర్చున్నారు

"చాలా.. చాలా సేపు కూర్చో.. కూర్చో లేను" నీరసంగా పలికాడు. మాట్లాడుతుంటే ఆయన నోటి నుండి భరించరాని దుర్గంధం వచ్చింది. మూలుగుతూ మెడ ప్రక్కకు వాల్చుకున్నాడు. ప్రసాద్ పండ్లు తోమి వేడినీళ్ళతో ముఖం కడిగి శుభ్రంగా తుడిచాడు. పొగలు కక్కుతూన్న కాఫీ, చక్కెర వేయకుండ మాస్టారి చేతి కందించింది ఆమె. కాఫీ త్రాగించి మళ్ళీ జాగ్రత్తగా పడుకోబెట్టారు. కాఫీ త్రాగిన తరువాత రోగి ముఖంలో కొద్దిగా ఉత్సాహం కనిపించింది. ఒళ్ళంతా చిరుచెమటలు పోసింది. ముఖం తేటగా కనిపించింది.

"నాయనా.. ప్రసాదూ.. నీ కెవరు చెప్పారు.. నేనిలా ఉన్నానని"

"మాస్టారు ఉత్తరం వ్రాశారు.. నిన్న సాయంత్రమే అందింది. వెంటనే బయలు దేరి వచ్చాను"....

"అయితే నీ కోసం మనిషి రాలేదన్నమాట. మనిషిని పంపించమని చెప్పానే" అంటూ ఏదో అనుమానం వచ్చినట్లు తనలో తానే మాట్లాడుకొన్నాడు.

ఒక క్షణమాగి "అమ్మాయి.. శారద కూడా వచ్చిందా?".. మాస్టారి కేసి కళ్ళు త్రిప్పాడు.

"లేదండీ.. శారద రావటానికి వీల్లేదు.. ఇవాళ నుండే వాళ్ళకు ప్రాక్టికల్స్..నేనూ ఉండలేక వచ్చాను.. ఎందుకంటే మరి సీరియస్‌గా ఉండకపోతే మాస్టారు ఉత్తరం వ్రాయరు కదా అని వెంటనే బయలుదేరాను" ప్రసాద్ జవాబిచ్చాడు.

సంతృప్తితో రోగి కళ్ళు మిలమిల లాడాయి. ప్రేమగా ప్రసాద్‌ను కొద్దిసేపు అవలోకించి "చూశారా కామయ్యగారూ.. వాడి కోసమని మనిషి పోయ్యాడు కదూ.. వాడి మావ.. శివాళ్ళకి నాల్గు రోజులు దాపటం లేదూ.. నేను మంచాన పడ్డానని తెలిసి కూడ వాడింకా రాలేదు."...ఆవేశ పడ్డాడు మాస్టారికేసి చూస్తూ...

"మీరు అవేమీ ఆలోచించకండి..మళ్ళీ ఆయాసమొస్తుంది ... వెంటనే సెలవు మంజూరు కావద్దూ? పైగా వాళ్ళకు కూడ పరీక్షలున్నాయేమో?..."

"నాయనా.. ఇటురా.. ఇక్కడ కూర్చో.. నేను చెబుతున్నా కూర్చో.. ఎవరికీ భయ పడాల్సిన పని లేదు. లోకం అంతే..భయపడు తున్నవాడిని కవ్వించి, కవ్వించి కుక్కలా వెంటబడుతుంది. ఎదురు తిరిగి నిలబడితే తోక ముడుచుకొంటుంది.. రా" వెంకట్రామయ్యగారు మళ్ళీ ప్రసాద్‌ను హెచ్చరించాడు.

భయపడుతూ భయపడుతూ తిరిగి ప్రక్కపై కూర్చున్నాడు. ప్రేమతో ప్రసాద్ వెన్ను నిమురుతూ అతను అడిగాడు.

"అయితే నీకు ఏకష్టమూ లేకుండ అన్నీ సక్రమంగా అమరాయా.. చెప్పు నాతో.. బట్టలు, పుస్తకాలూ, హాస్టలు ఫీజులూ... అన్నిటికీ ఏ లోటు లేకుండ మాస్టారు డబ్బు పంపిస్తున్నారా?"

అతను 'అవు'నన్నట్లు తల వూపాడు వేళ్ళ చూపులు చూస్తూ.

"ఇటుచూడు. నా వంక.. చూసి మాట్లాడు.. పిచ్చివాడవురా.. నా కెంత అభిమానమో నీకూ అంతే.." సంధి పుట్టి నప్పుడు పిచ్చిధోరణిలో పలికిన మాటల్లా మాస్టారికి అనిపించింది. విస్తుపోతూ ఆయన పెదవులపై దృష్టి నిలిపాడు.

ప్రసాద్ వేలాడుతున్న కాళ్ళు అసం

కళ్లంగా వూపుకొంటూ విశ్రాంతిగా గడియారం కేసి చూడసాగాడు.

"ఏమిట్రా.. ఆలోచిస్తున్నావ్" ఆప్యాయంగా ప్రేమ ఉట్టిపడుతున్న కంఠంతో అతను మళ్లీ అడిగాడు.

ప్రసాద్ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. పెదవులు కంపించాయి. అరచేతులతో, ముఖం కప్పుకొని కుళ్లికుళ్లి ఏడ్వసాగాడు, మాటా పలుకు లేకుండ. వెంకట్రామయ్య కనురెప్పలు కూడ మిలమిల లాడాయి. రెండు కన్నీటి బిందువులు చెవుల వరకూ జారి ఇంకిపోయ్యాయి. రెప్పలు తుడుచుకొని తన దుఃఖాన్ని నిగ్రహించుకొన్నాడు. గంభీరంగా కంఠాన్ని మార్చుకొని ప్రేమగా అతని చేతిని స్పృశించి అడిగాడు.

"ఏమిటి... చెప్పు"

"ఏమిలేదు.. ఏమిలేదు." అంటూ కళ్లు తుడుచుకొని మంచం దిగి గోడ వైపుకు తిరిగి నిలబడిపొయ్యాడు— దుఃఖాన్ని నిగ్రహించుకొంటూ.

"పాయవా.. ప్రసాద్.. నేనిలా రాలిపోతే నిన్ను ఆదరించే వాళ్లెవరని కుమిలిపోతు న్నావా"

"కాదు.. ముమ్మాటికీ కాదు" అతని కంఠం రుద్ధమై పోసాగింది.

"కన్నతల్లిదండ్రులు ఎవరో తెలియదు. అలాటి నిర్భాగ్యుణ్ని ఇంత వాణ్ని చేశారు. మీ ఋణం నేనెలా తీర్చుకోగలను.." స్టూలుపై కూర్చుని తల మంచం, పట్టెపై అన్చి క్రిందకు చూస్తూ పలికాడు.

వెంకట్రామయ్యగారి, రక్తహీనమై, పాలిపోయిన ముఖం మరింత తెల్లబారి పోయింది.

అతని ఉంగరాల జుట్టులోకి బలహీన మైన తన వ్రేళ్లను పోనిచ్చి వెంకట్రామయ్య పలికాడు... "ఏడవకు.. నీకు ఇప్పటివరకూ నే నెలాటి అన్యాయమూ చెయ్యలేదు.. నేను పోయ్యాక కూడ నీకు అన్యాయం జరుగనివ్వకుండ చూస్తాను.. నీ తండ్రి శక్తిహీనుడు.. పిరికివాడు.. నీవు క్షమించలేవు".. చివరి మాటల్లో కంఠం విచలితమై పోయింది.

బలమైన దెబ్బ తగిలినట్లు చివ్వున తల పైకెత్తాడు ప్రసాద్. మాట్లాడు తున్న వ్యక్తికేసి చూశాడు. అగాధమైన

కళ్లలో ప్రతిఫలిస్తున్న భావాలను వెదికి పట్టుకోవాలని కోరాడు. కాని అతని చూపు వెంటనే మాష్టారి కేసి తిప్పు కున్నాడు.

అప్పటివరకూ వారిద్దరి చర్యలనూ కనురెప్ప వేయక పరికిస్తున్న మాష్టారు మళ్లీ ఈ లోకంలో పడ్డాడు.

"మాష్టారు.. మీరిటు దగ్గరగా రండి.... ప్రసాద్ నువలా బయటికి వెళ్ళు" కొత్త శక్తి అతనిని ఆవహిస్తున్నట్లు మామాటలు మనిషిలా పలికాడు. ఆజ్ఞానుసారంగా ప్రసాద్ బయటికి నడిచాడు.

"మాష్టారూ.. గుంటూరు నుండి స్పెషలిస్టును పిలిపించండి సాయంత్రంలోగా. నన్ను గుంటూరు తీసికెళ్లి పెద్దడాక్టర్లకు చూపించుదామనే ఆ సంకల్పం నాకు నచ్చదు. ఎందుకు నన్ను బాధిస్తారు. ఎవరు చూసినా, ఎన్ని మందులిచ్చినా, ఈ గండం నుండి తేరుకొని బతికి బట్ట కడ్తాననుకోవటం పొరపాటు.. రోజుల్లో వాడ్ని.. స్పెషలిస్టును మీరెళ్లి పిలుచుకొస్తారా... లేక.." ఆగి ఆగి ఒక్కొక్క మాట ఉచ్చరించ సాగాడు.

మాష్టారు ఆలోచిస్తూ ఉండిపొయ్యారు.

"ఏమిటి.. ఇంకా ఆలోచన..."

"ఏమీలేదు. మీరు వీలునామాలో ఎవ రెవరి పేరిట ఏమి వ్రాయదలచుకొన్నారో నాకు చెప్పకూడదా ముందు.. మాటల సందడిలో మరచేపొయ్యాం. ముందు మందు త్రాగండి .. అంటూనే అతని గొంతులో మందు పోసి మంచినీళ్లిచ్చాడు మాష్టారు.

"అవును.. మీరు తెల్సుకోవాల్సిందే.. ఈపాటికి మీతో నేను ఈ విషయం ఆలో చించి ఉండాల్సింది".. కంఠం పొలపోయి దగ్గు రాసాగింది.

"ప్రసాద్ పేరిట కూడా కొంత పొలం వ్రాయదలచుకొన్నాను. బ్యాంక్‌లో పెట్టిన పదివేలు కాక..." ఇంకా ఏదో చెప్ప బోయ్యాడు. కాని మాష్టారు అడ్డొచ్చాడు

"మీరేమనుకోకపోతే నా సలహా ఒకటి.. మీరు ప్రసాద్ విషయంలో అనుకొన్న దాని కంటే ఎక్కువే చేశారు. వచ్చే సంవత్స రానికి బి. ఏ. కూడా పూర్తవుతుంది. ఇక వాడి కాళ్ల మీద వాడే నిలబడగలడు. పెంచిన ప్రేమ కొద్దీ మీరు అలా అంటు న్నారు. కానీనేను ఆ పొలం వాడికి దక్క

# మట్టి బొమ్మలు

నిస్తారా.. దానివలన వచ్చే ప్రయోజనం లేకపోగా ఎన్నో మనస్పర్థలొస్తాయి..పైగా నా సలహా వలననే మీరలా చేసుంటారని వాళ్ళు అపోహపడవచ్చు."...

"మీరు చెప్పేది నేను కాదనను మాష్టారూ?.. ఆమాత్రం నేను వూహించ లేకపోలేదు.. పొలం పుట్రా మేడ అన్నిటికీ నా తదనంతరం వారసుదారు 'మధు'.. ఇంత ఆస్తిలోనూ ప్రసాద్ పేరిట వ్రాసే పదెకరాలు ఏపాటి?.. కాబట్టి దానికి పెద్ద రాద్ధాంతం ఏమీ జరగదనే అనుకొంటాను. బొడవ పొలం పదెకరాలూ ప్రసాద్‌కు వ్రాస్తాను''.....

"ఆ కొమ్మలు కోసిన బర్రెకు మలుం పెట్టి పాలు తీయండ్రా అని చెప్పానా?.. తన్నిందంటే.. తన్నదు మరి..చెక్కా తవుడు కలిపి దాని ముందు బెట్టు".. బయట అచ్చమ్మగారి కేకలు లోనికి వినబడు తున్నాయి.

ఒకక్షణం బయటికి చూసి "ఆస్తి ఎంత ఉన్నా ఎక్కువకాదు గదా? ..మీలు నామాలో ప్రసాద్ పేరిట ఏమి వ్రాయ కండి... ఇప్పటికి మీరు చేసిన ఉపకారం చాలు.. ఇంకా దానం చెయ్యాలనుకొంటే, హైస్కూలు పేరిట వ్రాయండి.. దాని వలన ఎవరూ మనమ్ము కష్టపెట్టకోరు."

"అమ్మా.."బాధగా మూల్గుతూ "కొద్దిగా కాఫీ ఇస్తారా.. డాక్టరుగారు ఇంకా రాలేదే.. సరేలెండి.. నన్ను ఆలోచించుకోనివ్వండి... కానీ నాదొక కోరిక.. వాడ్ని ఒక ఇంటివాడ్ని చేసే భారం మీ మీద పెడు తున్నాను.. ఏది చెయ్యి ఇలా ఇవ్వండి" అని చేతిని తీసికొని తన గుండెలపై పెట్టుకొన్నాడు.

"దాన్ని గూర్చి మీరేమీ బెంగ పెట్టు కోకండి. తనకు, రూపం, గుణం, విద్య అన్నీ ఉన్నాయి.. అయినా ఈ కాలం కుర్రాళ్ల పెళ్లిళ్లా.. వాళ్లే కుదుర్చు కొంటారు మన ప్రమేయం లేకుండా.." చిరునవ్వుతో మాష్టారి ముఖం ప్రకాశిం చింది.

వెంకట్రామయ్య గారి ముఖం అదోలా అయిపోయింది. కోరిన సమాధానం మాష్టారి పెదవుల నుండి రాలేదన్నట్లు కనురెప్పలువాల్చుకొని కొద్దిసేపు ఆలో చించి మళ్లీ మొదలెట్టాడు.

"అదికాదు రామయ్య గారూ?—నా కోర్కెను మీరు అర్థంచేసి కోలేదు.. నోరు విప్పి అడుగుతున్నాను.. కాదనరు గదా?" కిటికీ నుండి పడుతున్న ఉదయ భాస్కరుని కిరణాలను ఒక్కింతసేపు పరిశీలనగా చూశాడు. కిటికీ అవత వెంతనే పాలు పితుకుతున్న శబ్దం 'జుయ్', 'జుయ్' మని వినవస్తోంది.

"మన స్నేహం చిహ్నంగా ప్రసాద్‌ను మీలో ఒకణ్నిగా చేసికోండి. ఇంతకన్న నేను కోరేదేమీ లేదు. "మాష్టారి చేతిని అతను బలహీనమైన తన చేతులతో శక్తి మేరకు గుండెలకు అదుముకొంటూ అన్నాడు. మాష్టారి ముఖకవళికలలో, ఏలాటి మార్పూ సంభవించలేదు. సహజంగా వారి ముఖంలో ప్రకాశించే చిరునవ్వు చెక్కు చెదరలేదు. కళ్లు దించేసుకొని ఆలోచించసాగాడు.

"చదువు.. సంస్కారం.. రూపం.. అన్నీ ఉన్నా వాడిని ఆదరించే వాళ్లను వేళ్ళ మీద లెక్కించవచ్చు.. ఇప్పటి సమాజంను గూర్చి నాకు గొప్ప అభిప్రాయమేమీ లేదు. డబ్బూ నాగరకత పెరిగే కొద్దీ జాత్యహం కారం, గర్వం, ఇవన్నీ ఇనుమడిస్తున్నాయే గానీ తగ్గుముఖం పట్టటంలేదు. ఏలాటి సహృదయులో వాడికి పోటీవ్వాలి"....., మాష్టారి మవునాన్ని పురస్కరించుకొని వెంకట్రామయ్య అడిగాడు.

"మీరు నన్నింతగా ఎందుకు పరీక్షిస్తు న్నారు.. సరే.. అలానే కానిద్దాం.. నాకూ అదే సంకల్పం ఉంది. కానీ అమ్మాయి ఇష్టా ఇష్టాలు తెలిసికోవద్దా.. అయినా, రెండేళ్ల నాటి మాటకదా!.. చదువులు పూర్తి కానివ్వండి.''..

ఆనందంతో అతని ఛాతీ ఎత్తుగా ఉబ్బింది. కృతజ్ఞతతో కూడిన చూపులతో మాష్టార్ని చూశాడు. "ఇక నేను నిశ్చిం తగా వెళ్లిపోతాను. ఈ మాట కోసమే

నేను ఇన్నాళ్ళూ ఎదురు చూశాను... అమ్మాయి శారద మీ మాటను కాదనదు, ఆ వినయమూ అణకువా జన్మతః వచ్చేవే కానీ.. నేర్చుకుంటే వచ్చేవికావు..అమ్మాయి నేను కన్న మహాసేలోగా వస్తుందను కొంటాను.

"విాకు తప్పక ఆరోగ్యం కుదుట పడుతుంది—బెంగ పెట్టుకోకండి.. ఆ... మరిచాను.. కాఫీ కావాలన్నారు గదూ?''.. అంటూ కామయ్యగారు అతనిచేతులో నుండి తన చేతులను విడిపించుకొన్నాడు.

"ఇప్పుడిహ కాఫీ ఎందుకు?.. హాయిగా ఉంది మనస్సు.. ప్రసాద్‌ను పిలవండి." మాష్టారు కిటికీలోనుండి చూసి ప్రసాద్‌ను పిలిచాడు.

ప్రసాద్ లోనికి రాగానే చెంత కూర్చో మని సైగ చేశాడు. ఆ తరువాత దుర్బ లంగా ఉన్న తన చేతులు రెండూ ప్రసాద్ మెడ వేసి పట్టుకొని మౌనంగా ముఖం లోకి చూస్తూ వూరుకొన్నాడు చాలాసేపు. ప్రసాద్ విస్తుపోయ్యాడు. అతని కళ్ళల్లో అలాటి చూపు ఇదివరకెన్నడూ చూడలేదు.

"ప్రసాద్.. నిన్ను పెంచి పెద్దచేసి, ఆరోజు వరకూ కంటికి రెప్పలా చూశారు.. నాదేముంది.. కావలిసిన డబ్బా దస్కమూ ఇచ్చాను.. అంతే.. డబ్బుపెట్టి ప్రేమను కొనుక్కోలేం.. కామయ్యగారి మాటను జవదాటవద్దు.. ప్రతి చిన్నవిషయంలోనూ వారి సలహా తీసికోవటం మరిచిపోవద్దు.. తెలిసిందా?.. మాష్టారూ... మీరిక ఇంటికి వెళ్ళండి..చాలాపొద్దెక్కినట్టుంది.' ఆయాసంగా గాలి పీల్చుకొని మాట్లాడటం ఆపివేశాడు. సడలించుకొన్న అతని చేతులను భుజాల నుండి తీసి ప్రసాద్ మెల్లగా ప్రక్కపై చేర్చాడు.

కిటికీ నుండి ప్రసరిస్తున్న సూర్య కిరణాలు మంచంపై నుండి మెల్లగా జారుతున్నాయి ఒక మూలకు.

ప్రసాద్‌ను ఉంచి వెళ్ళనా?''

"ఎందుకూ అక్కర్లేదులెండి.. తనుం డిగా'' భార్య నుద్దేశించి అతను పలికాడు.

మాష్టారూ.. ప్రసాద్, ఇద్దరూ ఆలని వద్ద వీడ్కోలు తీసికొని, మాట్లాడు కొంటూ అగేటు దాటి వెళ్ళిపోయారు.

(ఇంకా వుంది)



# రాధ ఎందుకేడ్చింది?

ఆర్. పద్మావతీ జగన్నాథ్

"ప్రకాశం!"

పిలుపు విని తలెత్తి చూసేడు ప్రకాశం. గుమ్మం దగ్గర బుజ్జి నిలబడి వున్నాడు.

"ఏం?" అడిగేడు ప్రకాశం.

"అక్క పిలుస్తోంది."

ప్రకాశం మాట్లాడకుండా పుస్తకం పక్కన పడేసి లేచేడు.

"రేపు మాకు సైన్సు పరీక్ష" అన్నాడు, నడుస్తూ ప్రకాశం.

"ఊఁ"

"ఎందుకు పిలుస్తున్నట్టు?"

"ఏమో"

ప్రకాశం తన చదువు పాడయినందుకు విసుక్కునేలోపల బ్యాండు వినిపించింది. ఇద్దరూ ఎదురుగా వున్న బుజ్జివాళ్ల ఇల్లు చేరేరు.

ఇల్లంతా చాలా సందడిగా వుంది. చాలామంది ఆడవాళ్లు, చాలా పట్టుచీరలు వాటి గరగరలు, సుగంధాలు, వాటి సువాసనలు, పువ్వుల గుత్తులు, వాటి వన్నెలు, వాసనల అందాలు, చంటిపిల్లలు, సివమాను, పన్నీటి జల్లులు, పచ్చటి నవ్వులు—అక్కడంతా చాలా సందడిగా అందంగా వుంది. అంతా పెళ్లి జరిగే ఇల్లు ఎలావుండాలో అలాగే వుంది.

బుజ్జి గబగబా లోపలికి వెళ్లి చేతిలో ప్లేటుతో సహా తిరిగి వచ్చేడు. ప్లేటులో లడ్డుండ, పులిహోర వున్నాయి. ప్రకాశం చేతిలో ప్లేటు వుంచి, "తిను" అన్నాడు బుజ్జి.

ప్రకాశానికి చాలా విసుగ్గా వుంది. మొహమాటంగా వుంది. మరునాటి పరీక్ష గురించి చాలా ఆత్రుత కూడా వుంది. ఐనా తప్పదు కనక గబగబా ప్లేటు ఖాళీ చేసేడు. మంచినీళ్లు, కాఫీ ప్రకాశంతో బాటు తాగేక, అక్క పెరట్లో వుంది అని చెప్పేడు బుజ్జి.

పెరడు విశాలమైనది. అందులో జాజి పందిరి తెల్లనిది. చక్కనిది. ఆ పందిరి కింద పచ్చని బంగారు రంగు అంచు వున్న నీలి రంగు పట్టుచీర కట్టుకుని ఒంటరిగా వుంది.

"పిల్చేవుట" అన్నాడు ప్రకాశం దగ్గరగా వెళ్లి.

రాధ తలెత్తి చూసింది. కొద్ది క్షణాలు మాట్లాడకుండా అలా చూస్తూనే వుంది. కాస్సేపయ్యాక, "అవును ప్రకాశం. కూర్చో." అంది.

ప్రకాశం ఇబ్బందిగా కూర్చున్నాడు.

"ప్రకాశం" బాధ అంచున వేదన విరిసి ఆమె గొంతులో పలికింది.

"వూఁ"

"చదువుకుంటున్నావా?"

"వూఁ"

మరి కాస్సేపు నిశ్శబ్దం.

"మరి కొద్ది రోజుల్లోనే నేను వెళ్లిపోతాను ప్రకాశం...... నాకు పెళ్లి... ఇవాళ రాత్రి. ....."

ప్రకాశం చాలా ఇబ్బంది, ఫీలయేడు. నిజమే! రాధకి పెళ్లి అని అతనికి తెలుసు. ఆ సంగతి చెప్పటానికి తనని పిలిచిందా?.. రేపు పరీక్ష. బాగా రాయకపోతే....?

"ప్రకాశం..." రాధ ప్రకాశం చేతిని మెత్తగా నొక్కింది. రెండు క్షణాలలా వుంచి చెయ్యి వదిలేసి,

"నన్ను మరచిపోతావా?" అంది.

ప్రకాశం ఆమె కళ్లలోకి చూసేడు. ఆ కళ్లల్లో అతనికి కొత్తదనమేదో కనిపించింది. రాధని మరచిపోవడమా? రాధ ఇలా ఇలా మాట్లాడుతోందేమిటి? ప్రకాశానికెందుకో రాధమీద చాలా జాలివేసింది. మనసులో మాటకందని భావం కదిలింది. ఏమనాలో తెలియక కళ్లకిందుగా చేతో...సుకున్నాడు ఎడమ కంటి కింద, రాధ అల్లరికీ చనువుకీ గుర్తుగా చిన్నగంటు.

*            *            *

"ఏయ్ ప్రకాశం! ఇస్తావా ఇయ్యవా?"

"ఊహుఁ! ఇవ్వను నీకు కావాలంటే నువ్వు కొనుక్కో" అన్నాడు ప్రకాశం సరదాగా చేతిలో ప్లాస్టిక్ తాజమహల్ బొమ్మని దాచేస్తూ...

"కొనుక్కోను ఇస్తావా ఇయ్యవా చెప్పు"

"ఇవ్వను"

"ఇయ్యకపోతే కొడతాను..."

"కొట్టు"

"ఉత్తుత్తవే కాదు నిజంగానే.."

"వాళ్లెద్దూ..."

...... ............

"అబ్బ.. ......"

"ముందే చెప్పేను విన్నావా?" చేతిలోంచి దూకుకు వెళ్లినరాయి ప్రకాశం

కంటికింద చేసినగాయాన్ని చూడకుండా బొమ్మ లాక్కుంటూ అంది రాధ. చేతిని కంటికిందు. నొక్కి వుంచిన ప్రకాశం మొహం వైపు చూసి, ఆతరువాత అచేతి లోంచి వుబికిన రక్తాన్ని చూసి రాధ చాలా గాభరా పడింది. వెంటనే బొమ్మని పక్కగ వుంచి, పరికిణీ చింపి, రక్తాన్ని తుడిచింది. ఏడుస్తున్నప్రకాశాన్ని డాక్టర్ దగ్గరికి తీసి కెళ్ళింది..........

ఆ చిలిపి కళ్ళనీ, అందమైన జుత్తునీ చూసి మైమరచి పోతుందిరాధ... అతిగా పెరిగిన అప్యాయత అప్పుడప్పుడు ద్వేషంగా బయల్పడి, మళ్ళీ అప్యాయతగా అయిపోయి అదుపు లేకుండా పెరుగుతుంది... ఆ దెబ్బ తనకి తగిలినా రాధ అంత బాధ పడి వుండేది కాదేమో.....! గాయం తగ్గాక ప్రకాశంతో ''కోపమా? సరదాగా చేశాను ప్రకాశం.... నిజం .. కాని నువ్వంటే నాకు ఎంత ఇష్టమో తెలుసా? . అలా అవుతుం దనుక లేదు. నిజం ప్రకాశం. నువ్వు నవ్వకపోయినా, జాజిపువ్వుకోసి జడలో వుంచక పోయినా ....నాకేం బావుండదు.'' అంది రాధ ప్రకాశం జుత్తులో వేళ్ళు దూర్చి.

ప్రకాశం కూడా నవ్వేశాడు. ''నాకేం కోపం లేదు. రాధా'' అన్నాడు. అని జాజి పువ్వుకోసి, ఆమె జడలో వుంచేడు.

పధ్నాలుగేళ్ళ ప్రకాశానికి పదమూడేళ్ళ రాధతో స్నేహం అలా అనుభవాలని నేర్పింది. ఆమె చనువు చాలా సరదాలనీ ఆమె కళ్ళలో వెలుగు చాలా సంతోషన్నీ నేర్పేయి. ఎదురింటి రాధ దాదాపు సొంతఇంటి రాధ అయిపోయింది. ఇద్దరి తల్లిదండ్రులలా వీళ్ళని చూసి సంతోషించేవారు. రాధ ప్రకాశాన్ని చూసి మరీ సంతోషించేది. రోజూ సాయంత్రం కలియాలి ప్రకాశం. ఆమె జడలో ఒక పువ్వునుంచాలి. కబుర్లు చెప్పాలి. ఆమె నవ్వులని పంచుకోవాలి. రాధ ప్రకాశం జుత్తుని చూసి మైమరచి పోవాలి. ఆతరవాత ఆజుత్తుని ప్రేమగా నిమరాలి. అతని కళ్ళలో కొత్తవెలుగులని రోజూ కని పెట్టి, ఎంతో ఆనందాన్ని అలరించు కోవాలి. ఇవేవీ లేకపోతే రాధకి చాలా వెలితిగా వుండేది. ఆమె ప్రకాశమంటే ఇష్ట పడింది. విపరీతంగా, అతని స్నేహాన్ని ఆరా ధించింది. మనసులో అతన్ని నిలుపుకొంది. అందువల్ల వెలుగు లని కూడా నింపు కుంది. ప్రకాశం లేందే జీవితం లేదన్న భావం ఆమెలో పెరిగింది.

తనకన్న ఒక క్లాసు ఎక్కువైన రాధ అన్నిటిలోనూ తనకన్నా ఎక్కువేననిపి చింది. ప్రకాశానికి ఒక్క వయస్సులో తప్ప. అతనికి రాధ చాల దగ్గరస్నేహితు రాలు. మనసుని మలచ గలిగిన చెలి. ఆమెతో ఆటలు, అనుభవాలు, ఆనందాలు రాధలోనూ చక్కని వెలుగులని నింపేయి. ఆమె ప్రకాశానికి చాలా దగ్గరైంది. అతను లేందే మనసులో వెలుగులేదని ఆమె అనుకుంది.

ఆమెతో సరదాగా అలా పధ్నాలుగేళ్ళ వయసొచ్చేదాకా గడిపేడు ప్రకాశం. ప్రకా శంతో మాట్లాడిన మాటల్నీ, తనుజడలో తురిమినపువ్వులనీ, ఆడిన ఆటలనీ సరదా లనీ గుండెల్లో నింపుకుని వెలుగులని పండించుకుంది రాధ. .....

ఓరోజు.....రాధ వారంరోజులు కనిపించ లేదు. అప్పుడు ప్రకాశానికి సాయంత్రాలు కొంచెం భారంగా గడిచేయి.....ఎప్పుడు రాధ కనిపిస్తుందో నని అతను ఏడు రోజులు ఎదురు చూశాక రాధ కనిపిం చింది. వింతగా, విరబూసిన పువ్వులా కని పించింది. ఓణీ వేసుకొని వుంది. ఎగరడం గెంతడం మానేసింది. పలకరించి నవ్వడ మేకాని, బుగ్గలు గిల్లడం, మొట్టికా యలుపెట్టడం మానేసింది. కాని రాధ చూపులు..... అదో కొత్త అందంతో అవేవో లోకాలనించి ఆకాశంమీదకు వెళ్ళి అక్కడ వెన్నెలని నింపుకుని ఈ లోకానికివచ్చి నట్టు మెరిసేవి. చెప్పలేనంత అందంగా విచిత్రంగా చూసేది రాధ. ఆ చూపులు ప్రకాశానికి చాలా ఆనందం, ఆశ్చర్యం కలిగించేవి.

ఇంకా పసారని ప్రకాశాన్ని.... ఇంకా నిక్కర్లతోనో అమాయకత్వంతోనో వున్న ప్రకాశాన్ని నుదుటిమీద పడే జుత్తు కళ్ళ మీద నించి తోసుకునే ప్రకాశాన్ని, బుగ్గ సొట్టలు పడేటట్టు నవ్వే ప్రకాశాన్ని అన్నిటిని మించి తనకు నచ్చిన మనసున్న ప్రకాశాన్ని....రాధ చాలా రంగుల్లో వూహిం చుకుంది. ఆమె అతనికి చాలా దగ్గ రైంది. ఆ దగ్గరతనం ఆమె మనస్సులో నిండి పోయింది........

* * *

ఓచల్లని సాయంత్రం....రాధతోబాటు వాళ్ళతోటలో కూర్చుని, ప్రకాశం పువ్వు కోసి ఆమె జడలో తురమ బోయేడు.

''వద్దు ప్రకాశం'' అంది రాధ. ....

''ఏమిటి? పెర్మిషన్ కావాలా పువ్వు కోయడమా?'' అన్నాడు ప్రకాశం. రాధతో స్నేహం అతనికి అందంగా మాట్లాడడం నేర్పింది.

''కాదు. ఇలా ఎదిగిన అమ్మాయిలు జడలో పువ్వు వుంచడం'' అంటు రాధ చిన్నగా నవ్వుతూ.

''ఓహో! ఐతే మరిన్నాళ్ళా తప్పులే దన్నమాట..'' అనేసి నాలిక్కరుచుకుని ఎందుకన్నానా అని విచారించి ''పోనీలే రాధా మరెప్పుడూ...మరెప్పుడూ ఇలాచేయనులే!'' అన్నాడు ప్రకాశం. అతనిగొంతులో కంగారు ధ్వనించింది.

రాధ చిన్నగా నవ్వి ''వెర్రివాడా!'' అంది, అతని నుదుటి మీద పడ్డ జుట్టుని మన్నితంగా నిమురుతూ ''నీకేం తెలీదు ప్రకా శం! వొట్టి అమాయకుడివినువ్వు'' అంది.

మరి కాస్సేపాగి ''మరి నేను ఎదిగాను కదా! ఇప్పుడు అబ్బాయిలతో చనువుగా వుండకూడదు.'' అంది రాధ కళ్ళని గమ్మ త్తుగా తిప్పుతూ.

''నాతోకూడానా?'' అమాయకంగా అడిగాడు.

''నీతో పరవాలేదనుకో...కాని నీతో కూడా అంతే .''అతనికళ్ళలోకి సూటిగా చూస్తూ అదోలా నవ్వుతూ అంది రాధ.

''మరి మీ అమ్మానాన్నా ఎందుకు మాట్లాడనిస్తున్నారు?'' అన్నాడుప్రకాశం.

''చెప్పానుగా నువ్వొట్టి వెర్రివాడివని నీసంగతి వేరు ప్రకాశం. నువ్వు...నువ్వు• వూహూ....అసలు నీకూ నాకూ తేడా లేదు.'' అంది రాధ మెల్లిగా అతని జుత్తుని మెత్తగా రాస్తూ.

ప్రకాశం నవ్వాడు.

* * *

మరో రెండేళ్ళకి రాధకి పదిహేనే ళ్ళొచ్చేయి ఎస్సెల్సి పాసయ్యింది ఇప్పుడు చీరలు కడుతోంది బాగా పొడుగైంది.దాదాపు ప్రకాశం అంత పొడుగుంది మనసులో పండించిన రంగులు ఇప్పుడు అందంగా అలుముకున్నాయి.

ప్రకాశం ఎస్సెల్సికొచ్చేడు. రాధతో చనువుబాగా తగ్గింది. ఎప్పుడో తప్ప కలియటం లేదు. అందువల్ల [illegible] లేదు. మంచి మార్కులు . [illegible] ంగా—అతని ఆలోచనలు. రాధని [illegible] వుండి మాటలు అంతే...

అందుకని రాధ ఎంత బాధ పడుతోందో వూహించటానికి అతనికి టైములేదు మనసు రాలేదు.

ప్రకాశం రాధతో చనువుని దాదాపు మరచి పోయాడు.

పరీక్షలకి శ్రద్ధగా చదువుకుంటున్నాడు. కాలం మనుషులని కొన్ని విషయాలనీ, ఎంత దృఢమైనవైనా, అనుభవాలనీ మరచిపోయేటట్లు చేస్తుంది. పొరగా పెరిగి మనసుని కమ్మేస్తుంది.

ప్రకాశం....పదిహేనేళ్ల ప్రకాశం ఇంకా విజిల్స్ వేస్తున్నాడు అతనికళ్లింకా అమాయకంగానే వున్నాయి. అతని జుత్తింకా నుదుటి మీద పడుతూనే వుంది.

## రాధ ఎందుకేడ్చింది?

ఆ మధ్య ఎప్పుడో ఇంట్లో అన్నారు ''రాధకి పెళ్లిట......'' అని.

''ఆహా'' అన్నాడు ప్రకాశం. మామూలు విషయాలన్నీ ఎలా విన్నాడో ఆవిషయాన్ని అలాగే విన్నాడు. వాటికెంత ప్రాధాన్యతిచ్చేడో దీనికీ అంతే!.. ఆ సంగతి తెలిసేక అతను రాధను కలియలేదు..

ఆమె కళ్ళలోకి పరీక్షగా చూడలేదు. ఆమె గురించి అదే పనిగా ఆలోచించలేదు. ఆమె మనసుని చదివేశక్తి అతనికి లేదు..

ప్రకాశం పరీక్షలు కొన్ని ఆయేయి. రాధ పెళ్లిరోజు వచ్చింది. ఆ రాత్రే రాధ వెళ్లిం.

* * *

''ఏం ప్రకాశం? మరచి పోతావా'' ప్రకాశం కంగారు పడ్డాడు.

''ఉహూ! ఎలా మర్చిపోతాను'' అని మొగమాటంగా నవ్వేడు.

రాధ చుట్టూ చూసింది. పెరట్లో ఎవరూ లేరు. అంతా లోపలే హడావిడిగా తిరుగుతున్నారు.

అప్పుడే వస్తున్న వెన్నెల వెలుగా పరచుకుంటోంది. జాజి పందిరి తెల్లగా వెన్నెల్లో మెరుస్తోంది. తెల్లని నక్షత్రాలు పొదిగినట్టు పువ్వులు అందంగా వున్నాయి.

వెలుగు వెన్నెల్లో ప్రకాశాన్ని పరీక్షగా చూసింది రాధ. మూడేళ్ళ! తన మనసులో దాగి కలవర పెట్టిన ఆ కళ్లు... నుదుటి మీద పడి గాలి కెగిరి అందంగా మనసుని కవ్వించే ఆ జుత్తు, ఆ అమాయకత్వం, ఆ నైర్మల్యం.....మనసులో పెనవేసుకున్న అతని ఆత్మీయత, దగ్గరతనం... చెప్పలేని పరమ విచిత్రమైన భావాల పరంపర.........

''ప్రకాశం! నిజంచెప్పు ప్రకాశం. నే వెళ్లిపోతున్నానంటే నీకేమీ అనిపించలేదా చెప్పు ప్రకాశం'' అందిరాధ.

ప్రకాశం చిన్నగా నవ్వేడు. ''ఏమనిపిస్తుంది? సంతోషంగా వుంది...సంతోషమంటే ..ఎలా చెప్పమన్నావ్? మా అక్క వెళ్లిపోతున్నప్పుడూ ఇలాగే వుంది...సంతోషం..... విచారం.....ఏదీకాదు. ఇంతేరాధా! పెళ్లిచేసుకుంటున్నావు.... అదృష్టవంతురాలివి....అంతేగా! ఎవరన్నా అంతే....'' అన్నాడు.

రాధ కళ్లలో —— —— కన్నీటి బొట్లు మెరిసేయి. అవి ఆమె బుగ్గలమీదుగా ముత్యాల్లాగా తెల్లముఖమల్ మీదుగా జారినట్టు జారేయి.

''అంతేనా ప్రకాశం'' రాధగొంతు సన్నగ వణికింది.

''అంతేరాధా..! కాని నువ్వు ఏడుస్తున్నావా రాధా? ఏమిటిది? ఎందుకనే!...'' ఆమె కన్నీళ్ళు చూసి ప్రకాశం చాలా గాభరా పడ్డాడు........

అన్నాళ్ళు తనని వెంటాడిన అందమైన కళ్ళూ, నవ్వడమే కాని ఎప్పుడూ కన్నీళ్ళు రాల్చని కళ్ళు, జాజి పువ్వులంత



# సైంటిస్టులు

## నొప్పిని అతి శీఘ్రంగా తొలగించునట్టి విధానమును

# కనుగొన్నారు




# మైక్రొఫైనెడ్ ఆస్ప్రో

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మా సమస్య:** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రొఫైనెడ్ ఆస్ప్రోను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రొఫైనెడ్ అంటే ఏమిటి?** మైక్రొఫైనెడ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము మునుపటి రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది:** క్రొత్త మైక్రొఫైనెడ్ ఆస్ప్రోలోని చురుకైన, పదార్థము అనాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 6 నుండి 7 గంటల దాకా వుంటుంది. అందువలనే, మైక్రొఫైనెడ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము:** క్రొత్త మైక్రొఫైనెడ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లలో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రొఫైనెడ్ 'ఆస్ప్రో'ను వాడండి:** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరములో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతుకనొప్పి.

**మోతాదు:** పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు: ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

క్రొత్త మైక్రొఫైనెడ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీరు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రొఫైనెడ్ చెయ్యబడుట వలన, ప్రతి, క్రొత్త మైక్రొఫైనెడ్ ఆస్ప్రో, బిళ్లలోను ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, ఇది అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ చెయ్యును.

క్రొత్త మైక్రొఫైనెడ్ 'ఆస్ప్రో', నొప్పిని, నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే, వాటిలో అతి ఆధునికమైన సాధనము.









మైక్రొఫైనెడ్

ఆస్ప్రో

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

నికోలస్ Ⓝ ఉత్పత్తి

## రాధ ఎందుకేడ్చింది?

అందంగా వెన్నెలంత వెలుగుతో నవ్వడమే కాని, విచారం లేని కళ్లు.... ఏడు స్తూంటే ప్రకాశానికి చాలా ఆశ్చర్యం, గాభరా వేసేయి.. "ఏమిటిది రాధా" అని చాలా ఆందోళనతో అడిగేడు ప్రకాశం.

"ఏంలేదు ప్రకాశం. ఏం లేదు...రాధ ముఖం నేపు కళ్లు మూసుకుంది. ప్రకాశం చేతిని చేతిలోకి తీసుకుంది. పెదవులదగ్గరగా తీసుకుని ముద్దు పెట్టుకుంది.

ఆతరువాత చేతిని వదిలేసింది.

"వెళ్లిపో ప్రకాశం. చదువుకో" అంది రాధ కన్నీళ్లలో.

"నిజమే ! చదవాలిరాధా. రేపు సైన్సు పరీక్ష వెళతాను......"ఇంకేమనాలో తెలియక ప్రకాశం లేచి వచ్చేశాడు. వచ్చేసే ముందు అతను సెరటి గుమ్మం దగ్గర నిలబడి వెనక్కితిరిగి చూసేడు. రాధ చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తోంది. ప్రకాశం నిట్టూర్పు, ఆతరవాత గాభరాపడి ఇంటి వేపునడిచేడు. అతనితో చెప్పలేనన్ని భావాలు చాలా మెదిలేయి.

ఆమర్నాడు పరీక్ష అతను బాగారాసేడు. పరీక్ష అయ్యాక అతనికి ఓరోజా జాజి పువ్వునిచూసే రాధ జ్ఞాపకం వచ్చింది, రాధ ఎందుకు ఆరాత్రి ఏడ్చిందోనని అతను ఆలోచించేడు. జవాబు తెలియ లేదు. నిట్టూర్చడం తప్ప ఏమి చేయలేదు ప్రకాశం.

* * *

మరో మూడేళ్లకి.... ఇంజనీరింగ్ రెండో సంవత్సరం చదువుతున్న ప్రకాశం బీచిలో కూర్చొని సిగరెట్టుకాలుస్తూ వెన్నెలని చూసుంటే, రాధ జ్ఞాపకం వచ్చింది. 'ఆరోజురాత్రి జ్ఞాపకం వచ్చింది జాజిపువ్వులు జ్ఞాపకం వచ్చాయి. ఆరోజు రాధమాటలు, కన్నీళ్లు జ్ఞాపకం వచ్చాయి. తన చిన్నతనం జ్ఞాపకం వచ్చింది. రాధ చేతుల్లో ముఖం దాచుకొని ఏడ్చిన దృశ్యం జ్ఞాపకం వచ్చింది. ఆలోచనలు అతివేగంగా పరిభ్రమించేయి.

................................

సముద్రంలో పడి వెన్నెల వెయ్యి వెలుగులని విరజిమ్ముతోంది.

ప్రకాశం బాధగా కళ్లు మూసు కున్నాడు. ●

# ఈ 'బ్రిజిల్' కొనల్ని భూత అద్దము క్రింద పోల్చి చూడండి



# బినాకా

## టూత్ బ్రష్

క్షేమకరమైన 'గుండ్రని బ్రిజిల్' కొనలతోకూడి
REG. PAT. NO. 69453
చిగుళ్లను తెగనీయదు

## పరిశుభ్రముగా తోమండి
## క్షేమకరముగా తోమండి
## బినాకా తో తోమండి

CIBA







(క) అగ్గిపుల్లలతో గమ్మత్తులు:

అగ్గి పుల్లలతో చక్కని గమ్మత్తులు చేయవచ్చు. ఉదాహరణకి కొన్ని చూపిస్తాను.

ఇక్కడి బొమ్మలో అగ్గిపుల్లలతో తయారుచేసిన సమీకరణాలు 5 ఉన్నాయి. ఇందులో ఉపయోగించినవి అన్నీ రోమను అంకెలు. మూడవ సమీకరణంలో చదరంలా ఉన్నది "సున్న" అనుకోవాలి. పరిశీలిస్తే సమీకరణాలు అన్నీ తప్పులే అని తెలుస్తుంది. మొదటి సమీకరణంలో 1–3=2 అని వుంది. రెండవ సమీకరణంలో 10–1=1 అని వుంది.

మూడవ సమీకరణంలో 2+0=1 అని వుంది. నాలుగవ సమీకరణంలో 6=2 అని వుంది. ఐదవ సమీకరణంలో 22/8=2 అని వుంది.

వీటిలో ప్రతి ఒక్క సమీకరణంలో నుంచీ ఒకే ఒక్క అగ్గిపుల్లను తీసి, మరొకచోట ఉంచి, ఆ సమీకరణం అర్థవంతం అయ్యేలా చెయ్యాలి. ఉదాహరణకు మొదటి సమీకరణంలోని = గుర్తులోని రెండు అగ్గిపుల్లలలోనూ ఒక దానిని తీసి, I కీ III కీ మధ్య నున్న మైనస్ గుర్తు మీద సమాంతరంగా పెడితే I=III–II

లేక 1=3–2 అని వస్తుంది.

ఇప్పుడీ సమీకరణం అర్థవంతమైంది. ఈవిధంగానే మిగిలినవి కూడా ప్రయత్నించండి.



















(చ) మేకలదొడ్డి

ఒకడు తన ఆరు మేకలనూ వేరు వేరు గదులలో ఉంచాలనే ఉద్దేశంతో 13 తడికలు ఉపయోగించి ఇక్కడి బొమ్మలో చూపినట్లుగా ఆరు సమానమైన గదులు తయారు చేశాడు. ఈ క్రింది బొమ్మలో తడికలకు బదులుగా 13 అగ్గిపుల్లలను ఉపయోగించి ఆరు గదులు తయారు చేశాం. ఒక రోజున రాత్రివేళ ఎవరో ఒక తడిక ఎత్తుకుపోయారు. ఆ మిగిలిన 12 తడికలతోనే అతడు శ్రమపడి ఆరు సమానమైన గదులు తయారుచేశాడు. అది ఎలా సాధ్యమో మీకు తెలుసా? అగ్గి పుల్లలు విరువకూడదసుమా!







(ఛ) నాలుగు త్రిభుజాలు

ఆరు అగ్గిపుల్లలతో నాలుగు సమ

బాహు త్రిభుజాలు తయారు చెయ్య గలరా? అగ్గిపుల్లలు విరువ కూడదు. ఒక్కొక్క పుల్ల త్రిభుజాలకు ఒక్కొక్క



బాహువు అయి ఉండాలి. సమ బాహు త్రిభుజం ఎలావుండాలో ఉదాహరణకు ఇక్కడి బొమ్మలో చూపించాను.

**జ వా బు లు**

(క) రెండవ సమీకరణంలో మైనస్ గుర్తు




ఒకటిగా మార్చబడింది. దానితో రోమన్ పది గుర్తు గుణకారపు గుర్తుగామారింది.

$1 \times 1 = 1$ అనే సమీకరణం వచ్చింది!

మూడవ సమీకరణంలో రెండును సూచించే రోమను అంకెలో నుంచి ఒక పుల్లను తీసి ప్లస్ గుర్తు క్రింద చేర్చాము. దీనిని "ప్లస్— ఆర్— మైనస్" గుర్తు అంటారు. అంటే "కూడినా లేక తీసి వేసినా" అని అర్థం.

$1 \pm 0 = 1$ అనే సమీకరణం వచ్చింది! ఒకటికి సున్న కలిపినా, తీసివేసినా ఒకటి వస్తుందని దీని అర్థం.

నాలుగవ సమీకరణంలో రోమను 6 అనే అంకెను వర్గమూలపు గుర్తుగా మార్చాం.

$\sqrt{1} = 1$ అనే సమీకరణ వచ్చింది!

ఐదవ సమీకరణంలో రోమను 8ంలో నుంచి ఒక పుల్లను తీసి, రోమను రెండు నెత్తిమీద పెట్టి "పై" π అనే గ్రీకు అక్షరాన్ని తయారు చేశాం.

$22/7 = \pi$ అనే సమీకరణం ఏర్పడింది! "పై" విలువ 22/7 అనడం సరి కాదనీ, దాని విలువ 3.1416 అని ఎవరైనా పూర్వపక్షం చేస్తే, అది కూడా సరియైనది కాదనీ, మనం ఉపయోగించే వన్నీ సత్యానికి చేరువలో ఉన్నవేకాని అసలు సత్యాలు కావనీ నీవు సిద్ధాంతం చేయ వచ్చు. తప్పులేదు.

(చ) ఇక్కడ చూపినట్లు పుల్లలను క్రమ షడ్భుజాకారంలో అమర్చి,




ఆరు సరిసమానమైన గదులుగా చేయ వచ్చును.

(ఛ) నాలుగు సమబాహు త్రిభుజములు ఒకే సమతలంలో ఏర్పడవు. ముందర




నేల మీద మూడు పుల్లలతో ఒక త్రిభుజం ("యరల" అనేది) ఏర్పరచు. తరువాత మిగిలిన మూడు పుల్లలను "పిరమిడ్"లా తయారు చెయ్యి. వరల, వలయ, వరయ, యరల అనేవి కావలసిన సమబాహు త్రిభుజాలు. ●




వరి కోతలు కాంగనే, పైకం సేత్లకి రాంగనె ఎంకిగాడి మనసుకి పట్నం సూడా లన్న ఖాయిషైంది పోలవ్వ కాడో పది, మల్లి మామ కాడో పదేను గిట్ల ఇరవై ఐదురుపాలు జమ సేసిండు

''బద్రంగ సూసిరారో! ఆడ రావిగాడ్ని కలుపుకోరో'' అని మామ, వూరి జనం అందరూ పొలిమేర దాకా సాగనంపింద్రు. ఆ వూర్లకెల్లి పట్నం సూసిరానీకి పొయ్యెటోర్లకి మొదటోడే మన ఎంకిగాడు వూర్లె ఆడంటె అందరికి జర్రంత 'ఇజ్జత్,' పెరిగింది ఆడు కండవ నెత్తికి సుట్టి, సుట్ట నోట్ల బెట్టి ధోతి అంచు బొడ్ల దోపి, రైలు ఎక్కి, పొలంలున్న నాగి సాయిగ సేతులూపితె, అది తన మామ ఎంత గొప్పోడో తెలుసుకొని మురిసింది

ఆడు సద్దిమూట, రెండు గిన్నెలు, పియ్యి' కట్టెల కట్టా పైన రైలు అటక మీద పెట్టి కింద రైలు భూమి మీన 'సక్కలం బుక్కలం' ఏస్కకూకొని దర్జాగా, ఇగ నోట్ల సుట్ట బెట్టి రైలింజని కంటె జోరుగా పొగ ఇడుస్తాంటె ఆడి మనసుల ఎన్ని కొత్త ఖాతులు గేపకం అచ్చిన్నాయ్?! యెవ్వరికి సెప్పలేనన్ని!!

రైలు ఘడిఘడికి ఆగుతా పోతున్నది. జర్ర టేమ్ బితాయించి నాంక ఎంకిగాడి కాడికో తెల్లబట్టల దొర అచ్చిండు.

''ఏంది కావాలె?'' గన్నట్టు సూసిండు ఎంకిగాడు.

''టికెట్'' అన్నడా దొర.

''అమ్మ నాయాలా! తిక్కటంట తిక్కటి! నీ యబ్బసొమ్మా ఫ్రయనీకి. ఆరు రూపాలిచ్చి కొన్న.'' అన్నడు జరంత కోపమై.

గంతల ఎనక్కెలి ఒక నీలం సొక్కా, నెక్కరేసుకొన్నో డొచ్చి, తిక్కటాయన గురించి ఎరక పర్చిండు.

''అర్నె! ఊరిదేనా రైలు!'' అని ముక్కు నేలేసుక్కున్నడు మనోడు.

''మరి కిందెందుకూకున్నవ్? పైన కూకోరాదు.'' అన్నడా పొట్టరాయన. పొట్ట రంటె రైలు జీతగాడని పక్కనుండ పెద్దమడిసి సెప్పిండు.

ఇగ అటుజేసి గిటుజేసి పట్నంల రైలా గింది. ఎంకిగాడు మూటాముల్లె యెత్తుకొని స్టేసని బైటికి నడవ బట్టిండు' ఈ కొనకెల్లి ఆ కొన కెల్లినా 'రాస్త ఎటో, 'దరవాజా' ఎటో ఎంకిగాడికి అంతే బట్టలేదు. ఆడికెల్లి నడుస్త జరింత దూరం పొంగనె కొంతమంది బైటికి తోస్కబోతా కంట బడింద్రు. ఎంకిగాడు' ఆళ్ల ఎనకాలే బైటికి పోబోయిండు. దార్ల ఇంకొక తెల్లబట్టల దొర ''టికెట్'' అని సెయి జాపిండు ఆర్నె! ఈరు ఆ తెల్ల బట్టల దొర తమ్ముడేమొ!' అనుకొన్నడు ఎంకిగాడు

''ఊరంతా నా తిక్కటెంబడి తగిలింద్ర''నుకొని మూట పక్కనదింపి తిక్కటు బొడ్లకెల్లి తీసి ఇచ్చిండు

ఆ దొర తిక్కటి సేత పుంచుకొని ఇగ పొమ్మన్నడు

''గిదేందయ్యా!? ఇంతమంది తిక్కట్లు ఇత్తునా సాలలేదా?! నాది నా కిచ్చెయ్!'' అని ఆడనే కూకున్నడు ఎంకిగాడు ఆ దొర

కాపై మనోడి మెడలు బట్టి బైటికి నూకిండు

"ఆర్నీ అక్కపొగరు!??" అనుకొంట కోపంగ ఎంకిగాడు బైటికొచ్చిండు

"యాడ్కి పోవాలె????!'' అని జరంత మంచి ఎంకిగాడి మాటలు గుంజ షురూ జేసిండ్రు

'యెంద్రో ఎందుకట్ల గుంజుతరు?'' గొంతుసించుక అర్సిండు అసలే తెల్ల బట్టలాయన తిక్కటి గుంజాకున్నడన్న కోపాన

"ఏంటికి కోపం సేస్తవయ్యా? మాకు రిచ్చబండ్లున్నయ్ యాడ్కి నిన్ను దీస్కో పోవాలె?'' అన్నడంతల్ల ఒక రిచ్చోడు

"గట్లనా? ఐతె రాత్రుండనీకి మంచి సత్రానికి దీస్కపో '' అన్నడు ఎంకిగాడు

"ఐతె ఆరాన ఇంయ్య ''అన్నడొక రిచ్చోడు

ఎంకిగాడ్కి కోపం అచ్చింది

"గిదేందంట! ఈడు పైకం అడుగ తడు, గదే వూర్ల బండెక్కుతె, చిల్లి గవ్వడుగరు!, పైకం లేదు గీకం లేదు, కాదంటె ఒక సుట్ట ఇత్త, ఘుమ ఘుమ తాగు'' అన్నడు ఎంకిగాడు పక్క జేబ్లకి చెయ్యి పోనిచ్చి

"పోరా! సుట్ట ఇత్తడంట, సవారి కట్టాలంట '' అనో ముసలి రిచ్చ తాత ఎల్లిపోయిండు

"ఈడ పైకం కట్టందే రారేమొ!'' అనుకొని సుట్టదుమ్ము గుంజి, ఓరిచ్చోడ్ని పిల్చి కిరాయి గిట్ట మాట్లాడుకొని రిచ్చె క్కిండు

రిచ్చ ముందుకు నడిసింది

'పట్నంల రంగురంగుల దీపాలు సొగ్గ పెట్టిండ్రు అబ్బ ఎందరు మనుసులు మందలు మందలు! అందరు సొక్కలు, లాగులేసుకున్నరు ఒక్కడు గూడా కండవ ధోతీ లేస్కోలేదాయి!' అన్నీ భవంతులే! రాస్తపంటి ఒక్కగుడిసె కూడా లేదాయి మన సొప్పదంట్ల పాలెంలనైతె అన్ని గుడిసెలే!'' రిచ్చోడు రిచ్చబండిని ఒక పెద్ద భవంతి ముందాపిండు

"గిదే సత్రం '' అన్నడాడు

"ఆర్నీ లక్కో! గింతంత దూరం గూడ తీస్కోపోతె, ఎక్కువ పైకం గుంజిండు ఈడ జరంత 'హోషియార్' గుండాలె అనుకొన్నడు

అబ్బ లోపలెన్ని బండ్లున్నయ్! అన్నీ మరబండ్లే! "డుర్" మని ముందుకురుకుతై దాని గొంతు యెట్ల నొప్పి పుట్టదో?? మడిసి అడ్డం వస్తె పాలు "కై " మంటది దానికి మడిసి కంటె ఎక్కువ తెలివె వుండది ఎంకిగాడికి, పట్నంల వింతలు మాబాగా నచ్చినయ్ దార్ల పోతున్న ఒక మడిసిని బిలిచిండు ఆ మడిసి సొక్కని నెక్కర్ల దోపిండు కండ్లకేమొ సులోచనాలున్నై మెడల బట్ట కట్టిండు ఆయనేదో బాసలని నవ్విండు

సత్రం సొయిగ సూపుతు "దాని పేరెందంట '' అడిగిండు ఆడు జరంత మనోడి మొహం సూసి ఘాటుగ

"తాజమహల్ బోర్డింగ్ ఎండ్ లాడ్జింగ్' అని పోయిండు

ఇగ ఎంకిగాడి కేమి అంతుబట్టలేదు

"తాజమల్లు బోడిగాడి'' ఆర్నీ అక్క! ఏం పేరు, ఏం పేరు! మా సొప్పదంట్ల పాలెంల గూడా లేదుగదా?!'' అనుకొంట ఎంకిగాడు లోపలికి పొబొయిండు

"ఏయ్! బాహర్ చెలో'' అనో తలపాగ వున్నాయిన మనోని అకారం సూసి బైటి కెల్ల నూకిండు

"అరేయ్ సత్రంలకి పోతె వద్దంటవేంద్రా గాడిదకొడుక!'' ఉడుకుతా అర్సిండు ఎంకిగాడు అసలే అకలి మీదున్నడేమొ! ఆ సత్రమొడు గివ్వేమి ఇన్పించుకోకుండా మనోడ్ని బైటికి నూకిండు

"ఇగ ఫయిద లేదు ఏడ్కన్నపోవాలె'' అనుకొని ఇగ నడువ షురు జేసిండు గట్ల లొంగపొంగ ఒక ఇంటి ముంగట పెద్ద అరుగులు కన్పించినై

అమ్మయ్య అని, పానం నొస్తుంటె కూకున్నడు ఇగ గిన్నెలు గట్ల దీసి పక్కనే రెండు బండలు పెట్టి జకముక రాయితో నిప్పుజేసి మెతుకులుడి కేసుకొని బువ్వదిని అరుగులు సాఫ్ సేసుకొని ఆ రెయ్యి అడ నిద్దుర బొయిండు

తెల్లారి గట్ల లేవంగనే ఒక ముసలవ్వ 'రాస్త' వూడుస్త కనబడ్డది మనోడికి, నవ్వొచ్చింది "గిదేందబ్బా! ఈ అవ్వకు పని లేనా వూకే వూకుడ్డి జర, ఇల్లూడ్చి కలాబు సల్లుకొనికే పొద్దెక్కుద్ది ఈమొకు గిట్ట పిచ్చెక్కలేదు గదా!'' అని ఎంకిగాడు నోట్లె కండవ కుక్కుకొని నవ్వాపుకో బట్టిండు

"గదేంది! ఆడ బువ్వొండినవ్ - అడంత నల్లంగ మాడింది ఆ బుడిదె అడ్నే వుంది నవ్? సిగ్గులేదు? రోజా సిలాంటోరు పోస్తె మేమూడ్వలేక సావాలె '' అని గయ్‌మని లేచిందా అవ్వ ఎంకిగాడికి మా పెడ్డ సిరాకేసింది

"నే పోస్తె నీ కెందుకు? పని లేకుండ వూరి బాటలన్నీ వూడుస్తొండవ్, నన్ను తిడ్తె వూరుకోనవ్వో!'' అన్నాడు మన సొప్ప దంట్ల పాలెమొడు

అవ్వ ఎంకిగాడ్ని సూసి నవ్వింది "పల్లె పల్లెమొమా పొయిరా!'' అంది ముక్కునే లేసుకుంటూ

ఎంకిగాడు కోపంగ మూటముల్లే పర్దు కొని బుజానేసుకొని నడవబట్టిండు!

కొద్దిదూరంల ఒక 'యాప' సెట్టు కంటబడ్తె మూటలు సెట్టు కిందబెట్టి సెట్టెక్కి పుల్ల ఇర్సుకొని నోట్లేసుకొని నడవ షురు జేసిండు జర్ర దూరం బోంగనె అడో నల్ల (రైల్లో కూసుండి దాన్ని లోపలికి నూకితేకింద గొట్టంల కెల్లి నీల్లొస్తయ్!!) వుంటె అడ మొహం గిట్ట కడుక్కోని సెట్టు కింద బువ్వ వండుకొని తిని ఇగ పట్నం సూడనీ కెల్లిండు

పట్నం ఒక పద్దతిల 'సూడాలని' అను కొన్నడు మనోడు ఒక దార్నపోయే రిచ్చోణ్ణి పిలిచి, "పట్నంల సూసేని ఏమున్నై'' అని అడిగిండు ఆడు నీల్లు తాగినట్లు గడగడ సెప్ప షురుజేసిండు

"మెల్లంగ సెప్పరాదు'' అన్నడు ఎంకిగాడు జర ఆ బాసేందో సమఝగాక

"చార్‌మినార్'' అని ఎల్లిపోయిండు రిచ్చోడు

"సారుమున్నరూ! గిదేం పేరబ్బా! - భలే గుండే మట్టగిడస లాగా!''

ఎంకిగాడు రాస్త ఎంటి అడుక్కొంట సార్‌మున్నరు కెల్లిండు అబ్బ ఎంత ఎత్తుగున్నది! - ఆకసంలకి సొచ్చుకొని, పోయింది ఎవడో రాచ్చసుడే దీన్ని కట్టుంటడాలె గుడిసెక మట్టి గోడలు కడితే నిలబడవు ఇంత పెద్దదెట్ల కట్టిండబ్బా?!'' మనోడు నెత్తి పైకి సూస్త ముందుకు నడవబట్టిండు కిందున్న అరటిపండు తొక్క సూడక దానిమీద కాలుపెట్టి సర్రున జారి ఎనకనే పుస్తకాలు పట్టుకొని నడుస్తున్నామె మీన తవాలి పడ్డడు.

ఆనో బాసల తిట్టి సెప్పుతో కొట్టి రుసరుసగా లాడ్జి పోయింది ఎంకిగాడు తం గ్గైనాగు తనం నాగి మీన బడ్డి గిట్లనే కొట్టుద్దా? ఛీ! ఏం పట్నం మడుసులు!'' అనుకొన్నడు మనసులో.

''ఏంరో ఎంకిగా'' యాడికెల్తో ఎవరో అరిచింరు. ఎనక్కి తిరిగి సూసిండు ఎంకిగాడు.

''అరె రామిగా!!??''

ఎంకిగాడి పానం లేచింది. ఆడికాడి కుతికె మూటాముల్లె కింద బెట్టి ఆడ్ని గట్టిగా వాటేసుకొన్నడు.

''పట్నం సూడ్నీకి వచ్చినవ్ రామీ,, వుండనీకి వసతులు గిట్ల లేవు కదా? నువ్వు కనబడకుంటె సీతమ్మోరంత కష్టాలు పడ్డననుకో.'' అన్నడెంకిగాడు లాల్ సూరత్ జేసుకొని.

మా ఇంటికి పోదాం పద ఆడనే వుండి పట్నం సూసుకొని పొలెం పొదుగాని''అన్నడు రామిగాడు.

''సరె మరిగ ఇంటికి పోదాం పద'' అన్నడు ఎంకిగాడు.

రామిగాడు ఎంకిగాడ్ని తన రిచ్చల కూకుండ బెట్టుకొని శాలిబండల ఉండ తన గుడిసె దిక్కు తోల్కపోయిండు.

గుడిసె కెల్లె దార్ల పట్నంల సూడ దగ్గవన్ని సెపిండు రామిగాడు. గుడిసె కెల్లి అత్త పెట్టిన బువ్వ దిని సూర్యుడు నెత్తి కొచ్చిందాక నిద్దుర బోయిండు సొప్ప దంట్ల పొలెమోడు.

ఇగ మద్యానం రెండు గంటలకట్ల 'సాయ్' తాగి పట్నం సూడనీ కెల్లింరిద్దరు.

''పట్నం సూడ్నీకి బాగ షైకం ఉం డాలె!'' అన్నడు రామిగాడు.

''గభేరాయించకు తమ్మీ, నాకాడు న్నయ్‌లే!'' అన్నడు ఎంకిగాడు మీసం దువ్వ కొంట.

''ఓటల్ కెల్దామె?'' అన్నడాడు.

'గదేంరో'' అడిగిండు ఎంకిగాడు.

'ఆడ షైకం దీస్కొని తిననీకీ తాగనీకీ ఇత్తరు.''

''గదా మనవాళ్ల సెన్నిగాడు పెట్టిండు.''

ఇద్దరు జరమంచి ఓటల్ లకే బోయింరు.

''అబ్బో గిదెందోగానీ ఒచ్చినోరందరికీ కుర్చి పీటలేసింరు. సెన్నిగాడ్నైతే సాపలు పరుస్తె సదిపొద్దిగా!'' అని వోరెల్ల బెట్టిండు ఎంకిగాడు.

# ఎంకిగాడు పట్నం...

ఇద్దరు 'సాయ్' తెప్పించుకొని తాగింరు.

షైకం కష్టాలకి ఎంకిగాడు గుడ్లు వచ్చబడినాయ్.

''ఆతాన గుంజిండు, ఈడమ్మ కడుపు కాల'' మనసులనే తిట్టుకొన్నడు ఎంకిగాడు.

ఇద్దరు బైటపడింరు.

''బస్సుల తిరుగుదాం?'' అడిగిండు రామిగాడు.

''ఆరెండు భవంతుల బస్సు ఎక్కుదాం!'' అన్నడు వూరోడు.

ఇద్దరూ రెండు భవంతుల బస్సు సిడీ లెక్కి పైకి బోయింరు. ఎంకిగాడు బస్సు కుర్సీల కూకొని ముందుకూ ఎనక్కూ సూసిండు. నడిపెటోడు ఎకడ కనబడలేదు.

''గిదేందబ్బ యొవ్వరూ నడపందే ఎట్ల నడుస్తది?'' అనుకొన్నడు ఎంకి. మెల్లెగ లేసి ముందుకు బొయ్యి కిటికీల కెల్లి బైటికి సూసిండు. ఎడ్లని గినక కట్టింరేమొనని. ఆడకూడా ఏదీ లేదు. ఎంకిగాడు మెల్లిగా రామిగాడి పక్కన కూకొని నడిపెటోడు లేడని సెప్పిండు.

ఆడు నవ్వి ''కిందున్నడులే ఆడే నడుపు తడు'' అన్నడు.

''గిదేందబ్బా? పైనేమొ నడిపెటోడు లేడు, ఆడేమొ కిందికెల్లి నడుపుతడంట. గదెట్ల కుదురుద్ది.. గిదేం బాలనాగమ్మ నాటకమా ఏమన్నవా!'' అనుకొన్న డెంకిగాడు.

ఇంతల అది ''డుర్''న మోగ సురు జేసింది.

గిదేంది, సలి జరం వచ్చినోడిలాగ,, గటూగ్గుద్ది '' అనుకొన్నడు మన సొప్ప దంట్ల పొలెమోడు.

'గది గంతెలె.'' అన్నడు రామిగాడు.

బస్సు కదిలింది. ఎంకిగాడు యదలో అగ్గి పుట్టినది, కాని 'సాంస్' బిగాయించి పట్టుకూకున్నడు. బస్సు కదిలి జర ముందుకుపోయినాంక జరన పానం సొస్సైంది.

''బాగయూవ్'' మని రెండు టిక్కట్లు కొన్నడు రామి. దార్ల ఒకింటి ముందు పెద్ద బొమ్మలు పెట్టింరు. ''గదేందంట'' అడిగిండు ఎంకిగాడు.

''అవి సైనేమ బొమ్మలు'' అన్నడు రామి

''గసేంరా ఎంకీ !''

అందులో గుడ్డపై బొమ్మలు ఆడుతై. గది గూడ సూడ్దంలె'' అన్నడాడు

ఇగ బాగయూవ్ రాంగనె ఇద్దరు బస్సు దిగింరు. ''అంటె ఎంకి, గీ బాగ యూవ్ ఎంరా, జరగూడ సమజైత లేదు.''

''బాగయూమంటె పట్నం మద్యలున్న తోట. గీడ వచ్చిని గడ్డి కూకోసికుంటది గులాబి పూల తోట బడే మజా గొస్తది ముందైతె అంటె నిజాం కాలంల ఇక్కడ జంతువులుండేవి, కాని ఈడినుండి అవి ''జూ''కి మార్చింరు. ఈడ సాయంత్రం పూట షికారు సేయనీకు బాగుంటది ఇక్కడ పడవ షైర్ కూడుంది.'' అనుడు రామి అన్ని సూపిస్త.

బాగయామ్మ ఒక సోట ఒకాయన, గడ్డి మీన కూకున్నడు, ఆయన సేత్ల అదేమ యంత పెట్టున్నది. అది కుయ్, కుయ్'న పాడుతున్నది. ''ఏంరా ఆ పదాలు పాడేది'' అడిగిండు ఎంకి.

''గదంతెలే'' అన్నాడు రామి.

''అంటె'' అన్నడు ఎంకి.

''గది లేడియు, పదాలు పాడుద్ది!''

జర దూరం నడిసినాక అడిగిండు ఎంకి, ''బాగయూవ్‌కి ఇంకో పేరు గిట్ల లేదా ''

''ఎందుకు లేదు, గదేదో బాసలంటరు పబ్లిగార్డన్స్''

అట్ల!'' ఎంకిగాడు ముక్కునేలేసుకొని నోరు తెర్చిండు.

ఇద్దరు పడవ సురుజేసింరు.

''ఎంకన్నా కొండెక్కుదాము!'' అన్నడు రామిగాడు దూరంగున్న గుట్టల పొయిగ సూపుతు.

మైసమ్మ కొండలా'' అన్నడెంకి గాడు కొండ మీద గోపురం సూసి

''ఏహె ఆడ తోటున్నది, దాన్ని నవబతో పహాడంటరు.''

''యేంరో రామిగో ఈ సొప్పదంట్ల పొలెమోడ్ని మోసం సేస్తవ్! కొండ మీద తోట పెరుగుద్దంట.'' ఎంకిగాడు నవ్వ షురుజేసిండు.

''దాకాదు నువ్వే సూసి గట్టి సేసుకో '' అన్నడు రామి.

ఇద్దరు కష్టం మీన కొండెక్కింరు

## రోజంతా హాయిగా, తాజాగా ఉండుటకు...

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్



పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ కుటుంబములో పిన్నా పెద్దా అందరూ రాసుకోవచ్చును. హాయినిచ్చే, పేరుదెచ్చే ఈ పౌడరు మెత్తగా ఉంటుంది, ఉపశమనము కలిగిస్తుంది, చెమటను త్వరగా పీలుస్తుంది ఇది మండే ఎండలలో, ఉక్కపోసే వాతావరణములో వాడుటకు దివ్యముగా ఉంటుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను వాడి తేలికైన పరిమళముతో రోజంతా తాజాగా ఉండండి!




అందరికి అందుబాటైన,
తేలిక పరిమళముగల
టాల్కం పౌడరు

ఆడ కొచ్చిన జనాన్ని సూసి ఎంకిగాడు మూక సేసుకొన్నడు. ఆడ పెద్ద తోట పువ్వుల చెట్లు అబ్బ! అబ్బ, ఏం కమ్మగుందాడ'"

యెవరో ఒకాయన పెట్టె పట్టుకొని ఏదో వత్తుతున్నడు. ముందు కొందరు నిలబడింద్రు కదలకుండ. ఆడికొచ్చిన ఆడోరు తెల్లగ పాలరంగుతో వున్నరు.

"ఆ డబ్బ ఎంద్రా రామీ" ఆడిగిండు మనోడు.

"గది సొటువోలు తీసేది."

"పొటువంటె నన్ను సిన్నప్పుడు మా అయ్య సింతబోసేన్ల దీయించేదు గదేనా" అడిగిండు.

రామిగాడు ఔనన్నడు.

"ఎంకిగా గటు సూసినావ్! గది హుసెన్ సాగర్ సెరువు."

"భలే గంద్రా." అన్నడాడు.

జర దూరంల అనేకం మరబండ్లు న్నయ్! గోపురం మధ్యల తెల్లని డబ్బా వున్నది.

"ఎంద్రా అది రామీ."

"సుక్కలు సూసేరన్నా."

"సుక్కలుండ్లా కనబడ్తయా" అడిగిండు. "ఔ" అన్నడు రామి.

ఇంతల సీకటి పడ్తున్నదని డబ్బ తెరిసింద్రు.

అందరు ఆడ గుమ్మిగూడి సైకం కట్టి సుక్కలు సూడబట్టింద్రు. ఎంకిగాడు సైకం గట్టి బొక్కల కెల్లి సూసిండు.

"సుక్క ఇంక సిన్నగ కనబడబట్టింది."

మనోడికి కోపమొచ్చింది. రామిగాడి సెయ్యి పట్టి ఆడికెల్లి ముందరికి గుంజుకొని పోయిండు. ఇగ ఆడికెల్లి కొండదిగి హుసెన్ సాగర్ దిక్కు నడవబట్టింద్రు.

గది సూసినావా" దూరంగ ఇనుము తంబానికి కొన్ని గొట్టాలు సూపిండు రామి.

"ఎందది?" అన్నడు గటుసూస్తు ఎంకి.

"గది నాలుగు బాటలు కలిసే సోట పెడ్తరు. అందులమూడు రంగుల దీపాలుంటై. ఎర్రది ఎలుగుతె ఆగాలి. పచ్చది ఎలుగుతె పోవాలె. పసుపు దెలుగుతె సిద్దంగుండాలె. రోడ్డు మీద మోటర్లు (మర బండ్లు) ఒకదాని కొకటి గుద్దుకోకుండ ఆ దీపాలు ఇచాయిస్తయ్" మనోడు నోరెల్ల బెట్టిండు.

గది సూస్కొని ఇగ ఉసేన్‌సాగరు కట్ట మీదికి కొచ్చింద్రు. గట్టు మీద అడాడ కుర్సీ పీటలేసింద్రు. ఆడభీ అనేకం జనమొచ్చింద్రు. ఇగ నడిసి నడిసి ఒక్కాడ ఇద్దరు కూకున్నరు. ఎనక బాట మీద అనేకంగ మర బండ్లు వురుకులు పెడ్తున్నయ్.

"చికీ చికీ" అంటు అరుస్తు ఒక, వొచ్చిండు.

"చిక్కి తింటావా?" అడిగిండు రామి.

"తెమ్మనవ." అన్నడు మనోడు.

"మరి చారానా ఇయ్యి."

"దీనికి గూడ సైకం కట్టాల్నా?" గుడ్లు తేలేసిండు మనోడు.

"ఆవ్!" అన్నడు రామిగాడు ఉషారై.

ఇగ సైకం గట్టి అవి తీసుకొన్నరు. దాని మీది వుల్లిపొర కాగితం సింపంగనే లోపలేదో వుంది.

మసగ సీకట్ల సరిగ్గ కంటబడలేదు.

ఇగ నోట్ల పెట్టి కొరికిండు ఎంకి.

"అరేయ్ గిది బెల్లప్పాకంరో" అనట్టిండు.

"ఔమరి చిక్కి అంటె గదే" అన్నడాడు. ఖుషిగ తిని లొట్టలేస్తు.

"ఏడ్పినవ్ సారానా కుబూల్ కర్చుపేసినవ్, పద ఇంటికి." అన్నడాడు ఏడ్పు మొహం పెట్టి.

ఇగ ఇద్దరు రెండంతస్తుల బస్సు ఎక్కి నవ్వపూల్ కాడదిగి ఇంటి దొవ్వ బట్టింద్రు.

దార్ల జర గుస్స తగ్గించి ఎంకిగాడు రామి నడిగిండు.

"రేపాడి కెళదం?"

"రేపు గోల్కొండా గండిపేట ఎల్దాం" మన్నడు రామి.

ఇద్దరా రెయ్యి ఇంటికి బొయ్యి సూరత్తు బెట్టిన్నసద్ది తిని కూకున్నరు.

"ఎంకన్నా!"

"ఏంద్రా."

"సైనేమా సూద్దామా?"

"ఏంద్రా"

"సైనేమానే, గుడ్డం మీన బొమ్మ లాడుతై! గది!"

"మరి అండ్ల ఏం సూపిస్తరు?"

"అండ్ల లవకుశ సూపిస్తరు. అది కాకుంటె అంజిగాడున్న సైనేమసూద్దాయే"

"గది సరెగాని ఆరు రాములోరి పిల్లగాంద్రు గదు" ఎంకిగాడు సెంపలేసుకొన్నడు.

"ఔనే" అన్నడు రామిగాడు.

"ఆడభీ సైకం గట్టాల్నా?"

"ఔ మరి."

"ఇగ బైలెల్లు, ఏం సేస్తం!" అన్నడు లేచి కండవ దులుపుకొంట.

సైనేమా సూసెసోటిగాడికి బొయ్యి సుట్టు తాగుకుంట లోపల కుర్సీల పీట మీన కూకున్నరు.

సైనేమ షురుగాబట్టింది.

ఎందో రాత సూపింద్రు, ఆనక నీలంగ రాములోరు కుర్సీ పీట మీన కూకున్నరు. ఆడ ఎందరో ఆడోల్లున్నరు. ఎనక్కాలి పాటలు పాడ్తున్నరు. రాములోరు నవ్వుతున్నరు.

సైనేమల ఆడోరు తైతక్క లాడ్తున్నరు.

గదే సొప్పుదంట్ల సొరంలన్నైతె, చిరతల రామాయణంల నాగి పాదాలు కలుపుతే, తను రామసెంద్రుడు, నాగి సీతమ్మోరి లెక్కుంటరు. వూర్ల తను రాములోరి ఏసం కడ్తె తననందరు సెయ్యెత్తి దండంపెడ్తరు. గదే ఇసయుం రామిగాడికి సెప్పిండు ఎంకి.

"గుడ్డంమీద రంగుల్ల ఏం వూర్లు అడువులు పల్లెలు ఎన్ని సూపింద్రు. సాకరి తిప్పుడు యమగున్నదనుకో, నాసామిరంగా!" అనుకొన్నడు. సైనేమ సూస్తు అండ్లనే రామిగాడ్ని నాగనుకొని గడ్డం పట్టి ముద్దు పెట్టుకున్నడు.

రామిగాడి గడ్డం గుచ్చుకొని మీసాలు ముక్కులకి పోంగనే ఈ లోకంలకొచ్చిండు ఎంకిగాడు. సైనేమల అంతా సీకటి సేసింద్రు గనక ఎవ్వరు సూడలేదనుకొన్నడు ఎంకిగాడు.

ఇగ సైనేమ అయిపోంగనే ఇద్దరు ఇంటికొచ్చి ఎచ్చగ నిద్దుర బోయింద్రు.

రాత్రి కలల సీతమ్మోరి లాగున్న నాగి కనబడంగనే జర్రంత ఏడుపొచ్చింది ఎంకిగాడికి. "నాగేయ్ ఈడ నేనెంత కష్టాల పాల్జెన్నో తెలుసా" అంట బోరు నేడ్సిండు ఎంకి.

* * *

''తెల్లంగ తెల్లారింద్రా లెవ్వరా'' అరుస్తున్నది అత్త.

ఇగ లేచి రామిగాడిచ్చిన పుల్ల నోట్లేసుకొని మొహంగిట్ల కడుక్కోని అత్త ఇచ్చిన సాయ్ తాగిండు ఎంకి. ఇగ తానంగిట్ల చేసుకొని సద్ది తిని పట్నం సూడ్నీకి బైలెల్లిండ్రిద్దరు.

''సైకం తెత్తున్నావే?'' అడిగిండు రామిగాడు.

''తెచ్చిన్నాల కెల్లి సగం అయిపోయింది.'' అన్నడు.

''మరి పట్నమంటె దరువనుకొన్నావ్?''

ఎంకిగాడికి రోషమొచ్చింది. జేబున్న ఇరవై రూపాలు తీసి సూపిండు.

రామిగాడు 'పదిగ' అన్నడుషారుగ.

ఇద్దరు నడుస్తు నవ్వపూల్ కాడికొచ్చిండ్రు.

ఆడ చిన్న గున్నబస్సు ఎక్కి కూకున్నరు. కొద్ది సేపైనాంక ఇగ బస్సు కదుల్తదనంగనే ఆడోరు మందలకు మంద లొచ్చి కూకున్నరు.

''ఒరమ్మొ సస్తిరో!'' అనరిసిండు ఎంకిగాడు.

''ఎంకన్నో పూరొక్కరో!'' అదిలించిండు రామిగాడు.

''మరందరు మీదనే కూకుంటున్నరు.

జర సేపు సంబాలించుకొంటె గోల్కొండ జేరతం.'' అన్నడు రామి బస్సు జనం తప్పించుకొంట గోల్కొండ జేరింది. ఇద్దరు ఇగ బస్సు దిగి గోల్కొండ సొయిగ నడవ బట్టిండ్రు.

''ఇప్పుడు భీ సైకం కట్టాల్రా రామి?'' అన్నడెంకిగాడు జరంత ఏడుపు మొహం పెట్టి.

''ఏహే! వూకె గభరాయించకు ఈడ సైకం గీకం లేకుండనే సూడచ్చు'' అన్నడు రామి.

''అయితె రామీ, గోల్కొండంటె ఏం ఏరా?''

''గోల్ అంటె గుండ్రటి కొండంటె కొండే!''

మలుపు తిరగంగనే పెద్ద తలుపులు కనిపించినై. ఆ మొద్దుల తలుపులు సూసి గభరాయించిండు ఎంకి.

''ఒరే రామి ఇదే భూతమొ దయ్యమొ కట్టిందిరా!'' అన్నడు సొప్పదంట్ల సొరె ముడు నోరెల్లబెట్టి.

''అవురంగజేబునే రాజ'' అన్నడాడు.

''గట్లనా!'' అన్నడు మనోడు జరంత తంగై.

లోపల ఎన్నో బొమ్మలు పెట్టిండ్రు. ఇగ లోపకెల్తున్నా కొద్ది చెప్ప సురూ జేసిండు రామిగాడు.

''ఇప్పుడ సప్పట్లు కొడ్తె, అగో ఆడ పైన ఇనబడ్తది. అది భీ సూస్తరా'' అని రామిగాడు ముందుకు నడవబట్టిండు.

జరంత దూరం పొంగనే ఆడో పెద్ద బావి కనబడబట్టింది.

''ఇందల్ల సైనికులోరు తానం గిట్లత సేసెటోరు.'' అన్నడు. ఎంకిగాడు జరం వంగబడి సూసిండు. నీల్లు పచ్చగున్నై. ఇగ ముందుకెల్లి మెట్లెక్క బట్టిండ్రు. జర దూరం పొంగనె ఒక పెద్ద దుకునం లాగున్నదాంట్లకు తోల్కపోయిండు.

''ఇదేంద్రో?'' అన్నడెంకిగాడు.

''ఇది రామదాసుగారి బందిఖాన'' అన్నడు రామి.

'ఆపైన బొక్కలున్నయ్ గవేందో?'

''మునుపు ఆడికెల్లి అన్నంగిట్ల ఏసెటోరంట.''

ఎంకిగాడికి రామదాసోరి కట్టాలను యాద్ సేసుకొంటె ఏడుపు రాబట్టింది. ఆడికెల్లి బందిఖాన మీది కెక్కిండ్రు. పైకెల్లి బొక్కలో సూస్తె కళ్ళు గిర్రున తిరగబట్టినై.

ఇగ ఆడంత సూస్కోని ఇంకా పైకెక్క బట్టిండ్రు.

జరంత దూరం ఎక్కంగనె కాలిక మ్మొరి గుడి కంటబడింది.

''ఇప్పుడికి రండియ్యో!'' అనరిసిండి ఆడికెల్లి అయ్యగారు.

ఇద్దరు పిడీలెక్కి. గుడిలో కెల్లిండ్రు.

అయ్యగారు ఆడికెల్లి బొట్టు తీసి ఇద్దరి మొహానికిపూసిండు.

ఇగ ఇద్దరు కాలికమ్మొరికి దండాలెట్టి ఎనక్కు తిరిగిండ్రు.

''ఏందయ్యో! అమ్మొరికి సైకం గిట్ల ఇయవా?, అమ్మొరికి సైకం గట్టకుంటె. నీకు 'నట్టం' సేస్తది. ఆ!'' అన్నడాయన.

ఎంకిగాడు రామిగాడి సొయ్‌గ సూసిండు.

''సైకం కట్టకుంటె అమ్మొరు కొండ మీదికెల్లి కిందికి తోస్తరు.'' అన్నడాడు. ఇగ ఏమనలేక అమ్మొరి పేర్న సైకం గట్టిండు.

ఇద్దరు గుడి పక్కకెల్లి వున్న సిన్న గుట్టెక్కిండ్రు. ఆడ రెండు పెద్ద తుపాకులు కంటబడినై. ఆడికెల్లి కిందికి సూస్తె బస్సు ముత్తెమంత కంటబడింది.

ఎంకిగాడికి మబ్బుల ఏరాన కూకున్నట్లైంది.

ఇద్దరూ ఆడ బీడీ కాల్చుక లాగి మెల్లగ రాజుగారు సభసేసే సోటికి పోబట్టిండ్రు.

మూడంతస్తులు ఎక్కినాంక ఎడం సేత్తైపున్న చిన్న గొందులో పిడీ లెక్కులె రాజుగారి కుర్సి కింది నుండి బైటికెల్తది. ఆడికెల్లి పైకెల్లినాంక దూరం కెల్లి సప్పట్లు ఇనబడినై.

''ఇన్నావరె?!'' అన్నడు రామిగాడు ఖుషి అయ్యి.

(62 వ పేజీ చూడండి)



# వసంతఫలం

ముద్దాచిట్టిబాబు

మనకు మామిడి పరిచయం ఉగాది పచ్చడితో ప్రారంభమవుతున్నది అప్పుడు విరివిగా దొరికే మామిడి పిందెలతో పచ్చడి ముద్దలు వేసుకుంటాం అసలు వూరగాయలకు ముందు ఇది నాంది వంటిది ఆ తరువాత క్రమంగా వూరుగాయలకూ ఉప్పుగాయలకూ పలు రకాల కాయలూ, వైశాఖ పూజలకూ ఆరగింపులకూ పసందయిన ఫలాలూ అందుకుంటాయి

ఫలజాతుల్లో పసందైనది మామిడి పండు అందుకనే దీన్ని 'ఫలరాజం' అన్నారు దీని పలుకుబడి ప్రఖ్యాతి చూస్తే తక్కిన ఫలజాతులు వోర్వలేకున్నాయి ఎలా అంటే —

మావి మధురకీర్తి విని మచ్చరమున
కంటగించెను పనస, టెంకాయలోన
బాష్పజలము, పోక వగరె ద్రాక్ష ముక్కె,
మొగము ముడిచె గజ్జూరము, జంబువు
మసిగొనె

ఇటువంటి మామిళ్ళు రెండు జాతులుగా వుంటున్నాయి: కోసుకు తినేవి పిడుచుకు తినేవి మనకు పరిచయమైన కోత రకాలలో కొన్ని బంగినపల్లి, కొబ్బరి మామిడి, మల్గోవా వంటివి రసాలు సువర్ణరేఖ, పంచదార కలశ, ఇమాం ముంగా, అరిపెల మామిడి— ఇవన్నీ పిడుచుకు తినేవి

ఇవిగాక— ముచ్చటయిన మరికొన్ని రకాలు:

గోవా, మాజీపీడు తియ్యమామిడి, బాగులాగొల్లి యారసాల, గోవిందయ్య మామిడి, ఏంద్రడము, ఓహారగిరు, చెరకు రసాలు, బిళ్ళపుండ మామిడి, రాచ, దిల్ పసందు (దీన్నే కలెక్టరు అని కూడా పిలుస్తారు) ఏనుగుతల మామిడి, చిలక ముక్కు మామిడి, కిరసనాయిలు మామిడి, కోటిపిస్ర మామిడి— ఇలా ప్రాంతాల్ని మట్టీ సందర్భాల్ని బట్టీ ఎన్నోరకాల స్థిరమైన పేరు సంపాదించుకున్నాయి

ఇంకా— [illegible] అయ్యి [illegible] రెండు చిత్రమైన రకాలున్నాయి

మన దేశం మొత్తంమీద ఇతర చోట్ల దొరికే తక్కిన రకాల పేర్లు కూడా కొన్ని చూడండి—

లాంగ్రా, బొంబాయి, ఫజ్లి (మాల్దా), ఆల్ఫాంసో, పెయిరీ, కొవాసీ పటేల్, బనేషన్ (బంగినపల్లి), తోతాపురి (బెంగుళూరు), గులాబ్ ఖాస్, జర్దాలు, బమాం, దషేరి, కిషన్—బాగ్, రిలం, పీటర్, ఫాదర్, హిమామ్ పసంద్, హిమ్‌సాగర్, గోపాల్ బాగ్, భూటో బొంబాయ్, మల్గోవా రుమాని, వంటివి

మామిడి జాతులు మన దేశంలో వ్యాప్తి పొందాయంటే ఆ చలవ అంతా మొఘల్ ప్రభువులదే అక్బరు పాదుషా మామిడి తోపుల కోసం కొన్ని వేల ఎకరాలు కేటాయించాడు మామిళ్ళు ఎన్నో రకాలకు మహమ్మదీయ సంబంధమైన పేర్లు రావటానికిదే కారణం అపారమైన 'చూత' కథా సాహిత్యంలోనూ మొదట పేర్కొన వలసిన వాడు అక్బరు ప్రభువే

ఒకసారి బీర్బల్‌తో కలసి అక్బరు పాదుషా మామిడి పళ్ళ పని పట్టిస్తున్నారు బీర్బల్ పరధ్యానంగా ఉండటం చూసి, అక్బరు తన టెంకలూ, తొక్కలూ అతని ముందుకు తోసి, "బీర్బల్!— అన్ని పళ్ళూ అవలీలగా లాగించేశావే? అంటూ చమత్కరించారు

అందుకు బీర్బల్, "జీ హుజూర్!— టెంకలూ, తొక్కలూ వదిలెయ్యటంచేత నేను బయటపడిపోయిన మాట వాస్తవమే కాని, ప్రభువులు సామాన్యులా! గడుసుగా చిన్న తొక్కయినా మిగల్చకుండా పట్టు పట్టేశారు!" కాని, సున్నితంగా దెబ్బ తీశాడు మామిడి టెంక ప్రసక్తి వచ్చినప్పుడు మరొక చమత్కార కథ విన తగి వుంది

బ్రహ్మాండమయిన ఒక వైశాఖ సంతర్పణలో బ్రాహ్మలందరూ బంతులు తీర్చి కూర్చున్నారు ప్రశస్తమైన మామిడి పళ్ళ వడ్డన జరిగింది ఆ ఉత్సాహంలో— ఒకాయన చేతిలో టెంకజారి, పక్కనున్న బ్రాహ్మడి విస్తట్లో పడింది పొరపాటు తెలుసుకున్న బ్రాహ్మడు లోలోపల చాలా బిడియపడుతున్నాడు కాని రెండో ఆయన నవ్వుతూ, 'చూశారా, శాస్త్రుల్లుగారూ!— నాకు వడ్డించిన పండులో రెండు టెంకలున్నాయి!' అన్నాడు అందుకు— సమయస్ఫూర్తి తెలిసిన మొదటి బ్రాహ్మడన్నాడు 'చిత్రమేనుమండీ! అంతకంటే వింత చూశారూ? నాకు వేసిన పండులో అసలు టెంకే లేదు!' అని బదులు చెప్పాడు అందరూ ఆశ్చర్యపోయారు కాని అసలు సంగతి ఒక్కళ్ళకూ తెలియదు

మానవుల కోరికలు తీర్చే మహిమ గల మామిడిపళ్ళను గురించి ప్రాచీన గాథలు ఎన్నో వున్నాయి 'బాలనాగమ్మ' కథలో రాణి లక్ష్మీదేవమ్మ జటంగి మునీశ్వరుడి దగ్గరకు వెళ్ళి, సంతానం కలిగే సాధనం అనుగ్రహించమంటుంది అప్పుడాయన—

పుట్టమీద మరి రాజమామిడీ
తందానతాన రాజవంధవావా!
వృక్షమున్నది మమ్మగన్న తల్లీ॥ తం॥
ఆ వృక్షము నిండా పండ్లు వున్నాయి॥
తం॥
నీవు పుట్టకు చెట్టుకు దండంబెట్టు॥
తం॥
ఆ చెట్టున ఏడు పండ్లు గోసుకువే॥
తందాన॥
తిరిగి నీవు నీ పట్నము పోవమ్మా ॥
తం॥

అంటూ సలహా చెప్పాడు

పూర్వకాలమందు కాబూలు దేశంలో మామిడి అంటే ఏమిటో ఎరగరు ఒక యాత్రికుడు ఆ ప్రాంతానికి వచ్చి మామిడి పండును గురించి వర్ణించేసరికి, వాళ్ళకి నోరూరింది అదెలా వుంటుందో ప్రత్యక్షంగా చూపించమని కూర్చున్నారు యాత్రికుడు చెప్పినట్టుగా ఒక గుండిగ నిండా చింతపండుపులుసూ, మరొక గుండిగలో బెల్లపు పానకం సిద్ధంగా పెట్టారు ఇద్దరు పెద్దవాళ్ళని వేదిక మీదికి




"నేను చెప్పలేదూ....., భీమారావు ప్రేమించే పెళ్లి చేసుకున్నాట్ట.......!" అన్నాడు పరుగెత్తుకొచ్చిన 'జ్ఞానసంబంధం.'

"అవునా?" అనలేదు ప్రేమారావు. అలా అప్పట్లో నోరావులించి చూశాడు.

ఆ చూపులో జీవంలేదు. తనమీద తను కసిగా విసుక్కున్నాడు. వార్త మోసుకొచ్చిన జ్ఞానసంబంధాన్ని కసిరికొట్టాడు.

"అయితే నన్నేం చేయమంటావ్? కావలిస్తే నువ్వూ అఘోరించు పో......" అన్నాడు తన విసుగుదలనంతా ఆమాటల్లో గుప్పించి.

"ఏదేవిటోయ్, అంత కోప మెందుకు? మొన్న మన రూంలో జరిగిన ప్రేమాయణ కళ్యాణ కాలక్షేపంలో నువ్వేమన్నావో జ్ఞాపకముందా?" అంటూ, అప్పటి చిట్టా బయటపెట్టి ప్రేమారావును అప్రతిభుణ్ణి చేయబోయాడు జ్ఞానం.

ప్రేమారావుకా సంగతి తెలియకనా? తెలుసు. అయితే తన భోళాతనం, చాతకానితనం ఎక్కడ బయటపడిపోతుందోనని భయం! ఆ రోజు, సభ తీరిన సహోద్యోయులు పురెక్కించగా తనూ ప్రేమించి తీర్తాను చూడడంబూ ప్రగల్భాలు పలికాడు. వాళ్ల పొగడ్తలకు ఉబ్బిపోయి అలా నోరు జారేశాడు. అదంతా జ్ఞానసంబంధం ఇప్పుడు ఎక్కడ ఏకరువు పెడతాడోనని అతన్ని ముందుకు చెప్పనివ్వలేదు.

ప్రేమారావుకు జ్ఞానసంబంధం రూమ్మేటు. వూళ్లో ఆడపిల్లలందరి చిట్టావర్జా అతని దగ్గరుంటుంది. పేరు చెబితే చాలు, నఖశిఖ పర్యంతం వర్ణించి గోత్రంతో సహితంగా, అమ్మా నాన్నల ఉపపాణ్ణలోపేతంగా కరతలామలకం చేసేస్తాడు. ప్రేమను గురించి పుస్తకాలేవీ చదవక పోయినా, ప్రేమారావులా సైకాలజీ సబ్జెక్టు తీసుకోక పోయినా ఏ పుట్టలో ఏ పాముందో, ఏ 'చిట్టి'లో ఏం గుట్టుందో ఇట్టే పసిగట్టి బయట పెట్టేస్తూంటాడు. అతను చెప్పే మాటలన్నీ కాశీ మజిలీ కథల్లా కర్ణానందంగా వింటుంటాడు ప్రేమారావు. ప్రేమారావు ఉత్సాహాన్ని పురస్కరించుకొని ఉన్నవీ లేనివీ కల్పించి మరీ కోసేస్తుంటాడు జ్ఞానసంబంధం. తన కలాంటి అనుభవాలేవీ లేనందుకు కసితీరా తిట్టుకుని, జ్ఞానసంబంధం అదృష్టాన్ని కొనియాడుతుండేవాడు ప్రేమారావు. ప్రేమారావు దురదృష్టానికి చింతించి సంతాపం ప్రకటించి 'పిచ్చి మొద్దువు, నీకేం తెలియదు నే న్నడిపిస్తాన్లేడు' అని అతనికి ధైర్యం చెబుతుండేవాడు జ్ఞానసంబంధం. అంతటి బుద్ధిశాలి యోగ్యుడు అయిన స్నేహితుడు తనకు అండగా ఉన్నందుకు ధైర్యంతో విహారాన్ని అదుపులో పెట్టుకొంటూ వుండే

వాడు.

ప్రేమారావు ఒకనాటి ప్రగల్భాలకారణంగా, ఇంతకు ముందు 'బావున్నావా?' అని పలకరించే వాళ్లిప్పుడు 'ప్రేమిస్తున్నావా?' అని కనబడ్డప్పుడల్లా పరామర్శిస్తున్నారు. తన అసమర్థతను ముల్లు పుచ్చుకొని పొడుస్తున్నట్టున్న పలకరింపులకి మొహం చాటు చేసుకోవడమో, తోకతొక్కితే కనపడిన ప్రతివాడినీ పలకరించ నివ్వకుండా, వాళ్లకు కాఫీలు పోయించి తన గోడంతా వెళ్లబోసుకుని, "వాడ్డూ యూ థింకూ........?" అని అడగడమో చేసేవాడు. అందుకు సమాధానంగా వాళ్లు: "నీ పేరే ప్రేమారావు, నువ్వు ప్రేమించకపోతే ఆబ్సర్డ్........ ప్రేమించి తీరాల్సిందే" అంటూ తలా ఒక చిట్కాను బోధించి చక్కా పోయేవారు.

వేరే బీరకాయలాంటి ప్రేమారావని పేరు పెట్టిన తల్లిమీద కాస్సేపు కోప్పడ్డాడు ప్రేమా రావు. తనపేరుకు 'ప్రేమించడాలు రావు' అనే అర్థం తీసుకుని తల్లిని వృధాగా కోప్పడ్డందుకు లెంపలేసుకుని పుసూరుమన్నాడు.

ప్రేమారావు అర్బకుడేం కాదు. అందరితో పాటు శుబ్బరంగానే వున్నాడు. ఇప్పుడిప్పుడే ఒక రకమైన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు దయ్యంలా పట్టుకుని పీడిస్తోంది. భూమ్మీద మనుషులందరూ ప్రేమల్లో మునిగి తేలుతున్నట్టు, తను ఒక్కడు మాత్రమే ఏకాంతవాసం చేస్తున్నట్టు బాధపడుతున్నాడు. ఈ జబ్బు ప్రారంభమైన దాది, అతనికి మనశ్శాంతి కరువై పోయింది. అలా కరు వచ్చినపుడు సినిమాల కెళ్తుండేవాడు. సినిమా కెళ్లినా దిగులే ఎదురయ్యేది. అక్కడ విహరిస్తున్న జంటల్ని చూసి, తన వంటరితనాన్ని వేలెత్తి చూపించుకుని భారంగా యింటికి తిరిగొచ్చేవాడు. గాలితగిల్తే ఏమైనా ఉత్సాహంగా వుంటుందేమోనని బీచ్‌కి వెళ్తే, అక్కడ అంతకంటే అధ్వాన్నం. బత్తిగా బతికేసి పోయారు మనుషులు అనుకునేవాడు. సాయంత్రం బజారు కెళ్లటం భయం! షికారు కెళ్లటం భయం! విందు వినోదాల కెళ్లటం భయం! అసలు బయటికొస్తేనే బోల్డంత భయం. మరి మనశ్శాంతి చిక్కమంటే ఎలా చిక్కుతుంది? పోనీ, తలుపులు బిడాయించుకుని యింట్లోనే కూచుందా మన్నా పిచ్చుకలు చెంపుకు తినేస్తున్నాయ్. సకల చరాచర జీవరాసులూ ప్రేమ సామ్రాజ్యంలో ప్రణయ యాత్రలు సాగిస్తున్నట్టూ, తను మాత్రం ఎందుకూ కొరగాకుండా, దద్దమ్మలా మిగిలిపోయినట్లూ కుమిలి పోయేవాడు.

ప్రేమారావుకు ప్రేమ పిచ్చి పట్టినప్పటినుంచి, ప్రేమించి తీరాలనే దీక్ష నవలంబించినప్పటి నుంచి, 'బియెలవర్', 'టీనేజు మెంటాలిటీ', 'వన్ థౌజండ్‌వేస్ ఫర్ లవ్' లాంటి పుస్తకాలెన్నో తిరగేశాడు. అవన్నీ ఫారిన్ పుస్తకాలు. ఈ దేశంలో వాతావరణం వేరు. అలాంటి పుస్తకాలు తెలుగులో లేనందుకు రచ



యితల్ని ఆడి పోసుకున్నాడు. ప్రేమకోసం ప్రత్యేకంగా సైకాలజీని విభాగించి స్టడీ చేయడం మొదలెట్టాడు. ఆడవాళ్ల ఆకర్షణ మేరకు ప్రవర్తించాలని ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు. గోళ్లు తీసుకోవడం దగ్గర్నుంచి, తలకాయ దువ్వుకోడం వరకూ లేటెస్టు డేట్‌గా పాటిస్తున్నాడు. సర్వసాధారణంగా ఆడ పిల్లలేం కోరుకుంటారో అన్నీ ప్రదర్శిస్తున్నాడు! అయినా ఛప్......, ఒక్కరూ ప్రేమించడము లేదు..........!!

ప్రేమించే వాళ్లందరి లాగా తనూ ప్రేమించాలనీ, తననూ ఒక సుందరాంగి ప్రేమించాలని పరితపించి పోతున్నాడు. తన లోపం లేకుండా ఇనడ్వాన్సు బోల్డంత మందిని ప్రేమించి లిస్టులో అట్టే పెట్టి వుంచాడు. ఆ బోల్డంత మందిలోను ఏ ఒక్కరైనా అర, కాకపోతే పాతిక కంటితో నన్ను చూస్తే ధన్యుడనై పోదును అనుకునేవాడు. ఇతని సంతృప్తికోసం వాళ్లు రెండు కళ్లూ విప్పారించి, చింతనిప్పులు కురిపించేవారు! ప్రేమారావు ఆ ఆశ్మ విడియస్తుడు. ఆడవాళ్లంటే మాటికి. తాను విడియస్తుడు కాదని అందరికి తెలియ పర్చడానికి నానా హంగామా చేసి, గుమ్మడికాయల దొంగలా దొరికిపోతూ వుండేవాడు.

'నాకు పర్సనాలిటీ వుంది, డబ్బుంది, దర్పముంది, చదువుంది, అన్నీ వున్నాయ్ గాని మడి లేదు. అందుకే నన్నెవ్వరూ ప్రేమించడం లేదు. పోని అందంగా లేనా అనుకుంటే,— పుట్టినప్పుడే దిలీప్ కుమార్‌లా వుండే వాణ్ణని అమ్మమ్మనేది. చిన్నప్పుడు దిలీప్ కుమార్‌లా వుంటే ఇప్పుడు కనీసం ఎల్విస్‌ప్రెస్లీలాగన్నా ఉండనా? ఎందు కుండను ఉంటాను. వుంటా నేమిటి ఖర్మ, ఉన్నాను. సెలవుల్లో ఇంటి కెళ్లినప్పుడల్లా ఎంత ఉప్పు- ఎన్ని మిరపకాయలు? ఈ ఖర్చంతా అమ్మ పూరికే ఎందుకు చేస్తుంది? నాకు దిష్టి తగులుతుందనే కదా! అయితేనేం? ఏం ప్రయోజనం? నన్నెవ్వరూ ప్రేమించడం లేదు. ఇదో పెద్ద డిస్క్వాలిఫికేషన్ అయి పోయింది.' అని బాధ పడేవాడు.

ఇక ఏమైనా సరే, జ్ఞానసంబంధాన్ని విడిపెట్టకూడ దనుకున్నాడు. స్థిర సంకల్పంతో, నీవే తప్ప ఇతఃపరం బెరుగ నంటూ కదలకుండా అతన్ని గట్టిగా పట్టుకున్నాడు.

ఎదురింట్లో నిమ్మి అనే అమ్మాయి ఉంది. ఆ అమ్మా యెప్పుడూ ప్రేమా రావునే వాలుచూపులు చూస్తూ వుంటుంది. ప్రేమా రావది కనిపెట్టక పోలేదు. పోనీ, ఆ అమ్మాయిని ప్రస్తుతానికి ప్రేమిద్దామా అని కొన్ని రోజు లనుకున్నాడు. కాని, నిమ్మి అతన్నెప్పుడూ అరకంటితో తప్పితే పూర్తి కళ్లతో చూసిన పాపాన పోలేదు ! మెల్లకన్నేకాకుండా దానికసలు పర్సనాలిటీవుండి చావలేదు. అలాంటిదాన్ని ప్రేమించకుండా వుంటేనే మంచిది, అనుకుని ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

జ్ఞాన సంబంధం ఒక చక్కని ఉపా

యారి చెప్పాడు. 'నిమ్మదగ్గరున్నంది ప్రేమ పాఠాలు నేర్చుకుని వరసగా వెళ్ళొకవ్వు' అని ప్రబోధించాడు. ఈ సలహా ప్రేమారావుకి నచ్చింది.

నిమ్మి అతనివంక తదేకంగా చూస్తున్న అదను కనిపెట్టి ఎలాగో ధైర్యం కూడ దీసుకుని జ్ఞానసంబంధం చెప్పినట్టు అక్షరాలు గుర్తు తెచ్చుకుని, అరచేతిని ముద్దుపెట్టుకుని, దానిని గాలిలోకి వూదేశాడు. వాయు సందేశంతో దానిని నిమ్మికి చేర్చాలని అతని ఉద్దేశం! ఏం జరుగుతుందోనని ఎదురు చూశాడు.

మధ్యలో పిట్టగోడ అడ్డు. ఆ గోడకు పిడకలు చరుస్తున్న అప్పలమ్మ ఆ వాయు సందేశాన్ని అందుకుంది! అందుకుని ఎన్ని వగలు తెచ్చిపోసింది! ఎంత వయ్యారం ఒలకబోసింది! అమ్మబాబోయ్......! ప్రేమారావు మళ్ళీ అటు తిరిగి చూస్తే ఒట్టు. నిమ్మి ప్రేమాయణానికక్కడితో నీళ్ళొదిలి కట్టేసుకున్నాడు. జ్ఞానసంబంధాన్ని పట్టుకుని పెద్ద పెద్ద జాబువైన మాటలు ఉపయోగించి తిట్టాడు. అంత జరగ్గా మనసులో ప్రేమారావుకు తెలియకుండా నవ్వుకున్నాడు జ్ఞానసంబంధం.

మొన్న సిటీ బస్సులో మరో విచిత్రం జరిగింది. బస్సులో జనం నిండుగా వున్నారు. సర్వ సాధారణంగా ప్రేమారావు లాంటి యువకులందరూ బస్సు బాగా నిండిన తర్వాత ఎక్కడం పరిపాటి. అలా నిండేదాకా సిగరెట్లు కాలుస్తూనో వచ్చే పోయే స్త్రీలను చూసుకుంటూనో, పిడార్లు కొడుతూ పరిగెత్తి బస్సు బయలుదేరే సమయానికి బిలబిల్లాడుతూ ఎక్కేస్తారు. సౌకర్యమైనంత జాప్యం చేసేందుకే ప్రయత్నిస్తారు. (గమనిక: మద్రాసు బస్సుల్లో ఆడవాళ్ళ సీట్లు వెనుక వుంటాయి!) కండక్టర్లకిదేం కొత్తకాదు. కసిరంతా కట్టగట్టి 'పుళ్ళ పోంగో, పుళ్ళపోంగో' అనే హెచ్చరికలు రుద్ది వెనకాల నిలబడ్డ మగాళ్ళమీద అసూయతో ముందుకు గెంటేస్తుంటారు!

ప్రేమారావు కూడా వుళ్ళా పోయి మళ్ళీ వెనక్కి తిరిగి చూశాడు. వెనక సీట్లో అతనికి బాగా నచ్చిన అమ్మాయి ఒకర్తె కూచుంది. నచ్చిందీ అంటే డంభా పూర్వసిల్లాంటి అమ్మాయనికాదు,

# ప్రేమారావు కథ

అతని వైపు వలపు చూపు చిలకరించింది, అందులో ఆ అమ్మాయి వంటి అందమైన వాళ్ళ బస్సులో లేరని భావార్థం! ఆ అమ్మాయిలా చూసినప్పుడు ప్రేమారావు మొదట్లో అనుమాన మొచ్చి జట్టును, కాలరు సరి చేసుకుని నిలబడ్డాడు. ఇంకా అలానే చూడసాగిందా అమ్మాయి. ప్రేమారావుకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చేసింది. అతని వెనక నిలబడ్డ ఒక 'స్ఫురద్రూపి' ప్రేమారావు తనను కొంచెం ప్రక్కకు



నెట్టాడు. తన్మయత్వంలో వుండడం వల్ల అతని ఏగడ్డమో చితక్కొట్టి వుంటానని 'సారీ' చెప్పుకున్నాడు ప్రేమారావు. చిరుదరహాసం ఒలకబోసిందా సుందరాంగి. తన 'సెవెక్సెన్స్'ను చూసి అనుకున్నాడు ప్రేమారావు. ఆ అమ్మాయి చిరుదరహాసానికి ప్రతిగా తను కూడా ఒక చిన్న సుమారైన అట్టహాసం చేశాడు. ఆ అమ్మాయి, మొహం ముడుచుకుని చురుక్కున చూసింది. ప్రేమారావు బిక్కచచ్చి పోయాడు. ఇంకా నయం, గోల చేయలేదు, అనుకున్నాడు. ఇందులో గోల చేయడానికేముంది? అయినా చేస్తే ఏంచేసేది? నేనేం చేయలేదంటే సరిపోతుంది అని సరి పుచ్చుకున్నాడు. ఆ అమ్మాయి వూరుకోవాలా? మొహమంతా మోహంతో నింపి మళ్ళీ నవ్వింది. ఈసారి ప్రేమారావుకు భలే కోప మొచ్చింది. గోముగా నవ్విందా అమ్మాయి, 'చాల్లేద్దూరగా మహా కోపం!' అన్నట్టుగా. ప్రేమారావు అయిపోయాడు. ఎవరూ ఏరుకోకుండా నవ్వు ఒలకబోస్తూ అలానే కొంతదూరం వచ్చాడు. అప్పటిమానం నవ్వు రాలేదు. లోలోపల దిగులు, ఎక్కడ స్టేజి దాటి పోతుందోనని!

ఆ అమ్మాయిని వెంటాడాలనుకున్నాడు. మొదట్లో ఏం మాటాడాలో, అలాంటి సిట్యుయేషన్ వొచ్చినపుడు ఎలా వ్యవహరించాలో జ్ఞానసంబంధం కాచి వడపోశాడు. 'మిమ్మల్నెక్కడో చూసినట్టుందే' అని కథల్లో చెప్పాలి. తరువాత పొరపాటయినందుకు మన్నించమనాలి. అమ్మాయి సంబరపడుతుంది. ఇంత మంచివాడని అమాంతం ప్రేమించేస్తుంది. ఇదంతా జ్ఞానసంబంధం చెప్పాడు. అది నెమరువేసుకుంటూ సమయం మరచిపోయాడు. ఆ అమ్మాయి నవ్వుతున్నప్పుడు, ప్రేమసుఖంలో దానికో లేక ఉబ్బితబ్బిబ్బు పోతున్నప్పుడూ, తను మామూలుగానే వుండిపోతే ఏం బావుంటుందని మొహం నొప్పెట్టినా నవ్వును అభినయించాడు.

ఆ అమ్మాయి దిగాల్సిన స్టేజ్ సమీపించింది కాబోలు, దిగడానికి ఆయత్తమయింది. అలా హాయిగా చూస్తూ ఆహ్లాదంగా నవ్వుతూ దిగి పోయింది. ప్రేమారావుకు పిచ్చెక్కినట్టయింది. ఈ అవకాశాన్ని జారవిడుచుకుంటే ఎట్లా? జన్మానికో శివరాత్రి అన్నట్టు ఇన్నేళ్ళకి ఒక మహా అందమైన అమ్మాయి ప్రేమించడం తటస్థించింది. ఇంత చక్కటి అమ్మాయిని, ఇంత చక్కటి అవకాశాన్ని విడిచి పెట్టుకోవడం బుద్ధిమంతుల లక్షణము కాదని జ్ఞానసంబంధం అంటాడు. అందుకని, బస్సు కదుల్తున్నా గబగబా దిగి బోర్లా పడ్డాడు. లేవగానే అతను చూసిందేమిటనీ? ఎవరితోనో చేయి కలిపి కులాసాగా నవ్వుతూ నడుస్తుందా అమ్మాయి! ఆ నడుస్తున్నవాడు కూడా

వివరో కాదు, తన చేత సారీ చెప్పించు కున్నవాడు!

'బ్రూట్......' అని తిట్టుకున్నాడు.... 'డర్టీగూస్'....... అని విసుక్కున్నాడు. చంటి పిల్లాడి తాయిలాన్ని కాకెత్తుకు పోతే ఎంత గట్టిగా ఏడుస్తాడో అంత గట్టిగా లోలోపల ఏడ్చుకున్నాడు. ముందు తనే గమనించి వుంటే ముఖం పీక్కు పోయి తల నొప్పించుకునే వాడు కాడు. ఈ పడతుల వేటలో ప్రేమ దక్కలేదు సరికదా, బస్సు కదులుతుండగా దిగి పోయినందుకు కండక్టరు చేత చివాట్లు దక్కాయి!

ఆ తర్వాత, ప్రేమారావు మరింత దిగులుతో కుళ్లి పోసాగాడు. 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు' అతని చుట్టూ గూడుకట్టి అతన్ని పొదగడం ప్రారంభించింది.

'ఛ......, నాకేం చాతకాదు. శుద్ధ దద్దమ్మని. వూళ్లో వాళ్లందరూ ప్రేమిం చేస్తున్నారు. ప్రతీ అడ్డమైన వాడూ, నిలువైనవాడూ ప్రేమించేస్తున్నాడు. కళ్లెదుట సుబ్బారావు చిట్టెమ్మ నెగ రేసుకు పోయాడు, రామమూర్తి మీనా మెళ్లో తాళి గట్టేశాడు, వెంకట్రావు మట్టుకు వెంకట్రావు సీతని చేజిక్కించు కున్నాడు, కాంతా కనకాల సంగతి సరేసరి, అర్ధనారీశ్వరుళ్లా ఎప్పుడూ కలిసే తిరుగు తుంటారు. చలం మట్టుకు ఏంచేశాడు పైకి చూస్తే పట్టి వాజెమ్మలా వుంటాడు. నిర్మలతో కలిసి ఇంగ్లీషు సినిమాకు వచ్చాడు. ఏం ఖబుర్లు, ఏం ఖబుర్లు! ఆ చచ్చు సన్నాసికీ నిర్మలకీ పోలికెక్కడా? చేతులు తిప్పుకుంటూ వాడితో నిర్మల ఒకటే గుసగుసలు ఒకటే గుసగుసలు. తను హాలు వరండాలో కూర్చుంటే, వాళ్లను చూసి తను సిగ్గుపడాలని, కుంచించుకు పోవాలని, అవమానంతో, కృంగి కృశించి నశించి...... పోవాలని నిర్మల రెక్క పుచ్చుకుని తనెదురుగుండా అటూ యిటూ ఎన్నిసార్లు పచార్లు చేశారు! తను పట్టించుకోనట్టు, గమనించనట్టు నటించాడు. వాడూరు కోవాలా? అబ్బే, కావాలని దగ్గర కొచ్చి పళ్లిగిలిస్తూ పలకరించాడు. నిర్మలను తనకు పరిచయం చేస్తాడా? అగ్నికి ఆజ్యం పోస్తాడా? హన్నన్నా.........!

ఎంత గర్వం! ఎంత టెక్కు! చూస్తే ఈనె పుల్లలా, గాలేస్తే ఎగిరిపోయేలా, రేవు కేసిన తాడిలా, నిటారుగా నిట్రాటలా పూగాగి పోతూ వుంటాడు, వాడికీ ప్రేమేనా? ప్రేమంటే ఎంత చవకై పోయింది! ఏదీ, తన దగ్గర కొచ్చేసరికి బ్లాక్ మార్కెట్లో కూడా దొరకనంత కరువై పోయింది! అసలు, ఇలాంటి వాళ్లందరూ ముందస్తుగా ప్రేమించే స్తుండడం బట్టే, తనదాకా వచ్చేసరికి అయ్యవారి నట్టిల్లులా తయారయింది. దేశమంతా గొడ్డుపోయింది ఛీ.......!!

— అలా మనోవేదనతో సతమత మవుతూ కూర్చున్న ప్రేమారావు ముందు నుంచి, ఒక హనుమంతరావు, మరో హనుమాయమ్మ చెట్టా పట్టా లేసుకుని ఇకయికలు పకపకలతో అతన్ని వెక్కి రిస్తున్నట్టుగా డ్యాన్సు చేస్తూ వెళ్లారు.

వళ్లు మండి పోయింది ప్రేమా రావుకు. చేతులో సిగరెట్టు నేలకేసికొట్టి కాఫీ హోటల్లో దూరపడ్డాడు. అక్కడా అంతే, ఎన్నో జంటలు, ఎన్నో గుసగుసలు! అదృష్టం కొద్దీ, ఆ హోటలు సువిశాలంగా వుంటుంది గాబట్టి సరిపోయింది. ప్రేమా రావు సరాసరి వెళ్లి, నన్ను ముట్టుకోకు నా మాలకాకి అన్నట్టుగా ఎక్కడో పక్కని కూచున్నాడు. ప్రొద్దున్న కాఫీ తాగిన తర్వాత ఆలోచనకు ఉపక్రమించిన మనిషి, ఆలోచన తెగకుండాగా భోజనం వేళ మించి పోయినందుకు చింతించాడు. మళ్లీ కాఫీ తాగి, చెయిన్ స్మోకింగ్ మొద లెట్టాడు. ఇదివరకు అతనికి సిగరెట్టలవాటు లేదు. 'పొగ తాగనివాడు దున్నపోతై పుట్టున్, ఆ పిల్లలు ముఖమెత్తరు — చూడర్' అని, జ్ఞానసంబంధం బల వంతాన నేర్పించాడు. పెట్టెలో వున్న ఇరవై సిగరెట్లూ అయిపోయినా ఆలో చనకు ఒక రూపమంటూ ఏర్పడలేదు.

ఇట్లు, ప్రేమారావు దీర్ఘాలోచనా తత్పరుడై చింతాక్రాంతుడై ఉండగా 'సన్‌లయిట్' వచ్చి ఎదురుగా కూచుంది. (సూరేకాంతానికి ప్రేమారావు పెట్టిన ముద్దుపేరు సన్‌లయిట్) కూచొన్నట్టు కూడా అతను వెంటనే గమనించలేదు. సిగరెట్టు చేతిని కాల్చినప్పుడు ఎదురుగా సాక్షాత్కరించిన దేవతను చూసి ఉక్కిరి బిక్కిరై పోయాడు.

సూరేకాంతం అరవ పిల్ల. అలాగని జ్ఞానసంబంధం చెప్పాడు. ప్రేమారావు సూరేకాంతం గురించి అడిగినప్పుడు జ్ఞాన సంబంధం ఇంకో విన్నపాన్ని వివరా లిచ్చాడు. అందులో ప్రేమారావుకు నచ్చనివే ఎక్కువ వున్నాయి! నచ్చిన వాటినే ఎన్నుకున్నాడు ప్రేమారావు. దాని కారణం లేకపోలేదు. సూరేకాంతం చాకులా వుంటుంది. అలా గని జ్ఞానసంబంధంతో చెప్పాడు. 'వాళ్ల బాబు బాకులాంటివాడు. చంపే స్తాడు. తెలిస్తే ముక్కలిరగ తంతాడు' అని భయపెట్టాడు! జ్ఞా. సం.

ప్రేమారావు వీధివెంట నడుస్తూ సూరే కాంతాన్ని ఎన్నోసార్లు చూశాడు, ప్రేమిం చాడు కూడా. అతని దృష్టికి అంది,— అందం, అంగీకారం వున్న పిల్లనల్లా అతను ప్రేమించాడు. ఇనప్పాన్ని జాబితాలో చేర్చుకున్నాడు. అందుకే 'కాన్సన్‌ట్రేషన్' పోయింది. 'ఒకే అమ్మాయి మీద మనసు లగ్నంచేసి వుంచితే ఆ అమ్మాయిని ప్రేమిం చడం తేలిక. ఆ అమ్మాయీ ప్రేమి స్తుంది.' —అంటూ టెలిపతి గురించి గంటా రెండు కాసేల ఉపన్యాసం ఇచ్చాడు. జ్ఞా. సం. అప్పటినుంచి అలానే చేద్దామని అతి కాన్సన్‌ట్రేషన్‌తో ప్రయత్నించాడు. ఏదో ఒక అడ్డు. తనవల్ల కాలేదు. వారం రోజులు తదితరులెవరి దృష్టితో వుంచు కోకుండా ఏకాగ్రతతో ఒకే అమ్మాయి మీద మనసు లగ్నం చేయడం బహుకష్టం అనిపించింది. నిరాహారదీక్ష నన్నా సహించ గలను దాని ఇలా నిరామయంగా వుండ లేనని నిశ్చయించుకున్నాడు. ఒకటిరెండు రోజులు అలా లగ్నం చేసినా, తను ఏకా గ్రతోపాసనలో వుండగానే ఆ అమ్మాయికి లగ్నం పెట్టేసుకోవడమో, మరొకరితో విహరించడమో, లేదా లేచిపోవడమో, అతని కళ్లెదుటే జరిగిపోతూ వుండేది. సహ నానికి ఒక హద్దంటూ వుండాలా? తత్ఫ లితంగా జ్ఞానసంబంధానికి ఇన్నిసార్లు ఉలిక్కారం అనిపించి, అంతకుమించిన, చివాట్లు పెట్టేవాడు!

అయితే ఇప్పుడీ పిల్ల వంటరిగా ఎందు కొచ్చినట్టు? ఆడపిల్లలు తోడులేకుండా ఆ హోటలుకు రావడం మొదటిసారిగా చూస్తున్న అతనికి సందేహం తోసుకొచ్చింది. అందులోనూ ఎక్కడా చోటులేనట్టు తన కెదురుగానే కూర్చున్నందుకు మరీ ఆశ్చర్య

# ప్రేమారావు కథ

పోయాడు.

ఎట్టకేలకు ధైర్యంచేసి, ప్రేమించిన జీవితాలో ఏదో ఒక సంఖ్యలో వున్న సూరేకాంతాన్ని ఎగాదిగా చూశాడు. సూరేకాంతం చాలా గడుసుపిల్ల. చూస్తేనే తెలుస్తుంది.

సూరేకాంతం అతన్ని గమనించింది. వాలకం కనిపెట్టి, ఫర్వాలేదు, కాఫ్నీవు, కూడా మంటాడులే అని నిర్ధారణా చేసుకుని, గమనించనట్టూరుకుంది. పర్సు తీసి అందులో నగంరాసిన కాంబతాన్ని బయటికి తీసి ఏవో రాసుకోవడం మొదలెట్టింది.

సర్వర్ వచ్చాడు. 'కాఫీ' అంది సూరేకాంతం. ప్రేమారావు కూడా కాఫీ, అన్నాడు. తెల్లబోయాడు సర్వారావు ఎన్నిసార్లు తాగుతావు? అన్నట్టుగా చూశాడు. 'నీ పని నువు జూసుకో, లేదా బిజినెస్ పాడు చేస్తున్నావని మీ మేనేజర్‌తో చెబుతా' నన్నట్టుగా చూశాడు ప్రేమారావు. కిక్కురుమనకుండా వెళ్ళిపోయాడు సర్వారావు.

సంభాషణ ఎలా మొదలుపెట్టాలా అని లోలోపల తర్జనభర్జన చేసుకుంటూ జ్ఞానసంబంధాన్ని స్మరించుకొంటూ కూర్చున్నాడు. ఇలా ఉపేక్షిస్తే, మధ్యలో ఏ గ్రద్దయినా తన్నుకుపోడానికి అవకాశముంటుంది గనుక జ్ఞానసంబంధం ఉపదేశించిన పంచాక్షర మంత్రాన్ని అవాలు పరుద్దామనుకున్నాడు. ఒక్కొటి జ్ఞాపకం తెచ్చుకున్నాడు. మొదటిది వాతావరణం గురించి (ఆకాశం నీలంగా వుందనో, చెట్లు పచ్చగా వున్నాయనో... ఎక్సటరా) రెండవది — హోటళ్ళో పదార్థాల గురించి (నాసమ్మగారెల వంట దగ్గర్నుంచి తనకు స్వీటిష్టమో, హాటిష్టమో. ఎక్సెటరా) మూడవది—మగవాళ్ళ ప్రవర్తన గురించి ఆడపిల్లల వైఖరిలో మగవాళ్ళు అధ్వాన్నంగాను అసభ్యంగాను ప్రవర్తిస్తున్నారు... స్త్రీకి స్వాతంత్ర్యం ఉండితీరాలి.. ఎక్సెటరా నాల్గవది—సినిమాలు (ఇష్టమైన నటీనటులు.. సెన్సార్ బోర్డును తిట్టడం.. ఎక్సెటరా) ఐదు— దేవుడూ దెయ్యమూ.. ఆపైన పిలువెంట రాజకీయాలు. ఎక్సెటరా) ఈ 'వాహ సోవసిదే' పంచాక్షర మంత్రాన్ని సంభాషణలో జొప్పించడం, ప్రదేశ కాలమాన పరిస్థితులనుబట్టి నువో ప్రవర్తుల ననుసరించి, యిష్టాయిష్టలను గ్రహించి, ఆపైన హెచ్చవేతలూ తీసివేతలూ లాంటిది చేస్తుండాలని జ్ఞానసంబంధం ఉవాచ. ఈ ప్రణాళికను ప్రవేశపెట్టే ముందు మరో ప్రయోగం చేయనున్నాడు.

అంచేత, గుచ్చిగుచ్చి సూరేకాంతం, కళ్ళల్లోకి చూద్దామనుకున్నాడు. సూరేకాంతం కూడా అతని వేపు చూడాలిగా మరి! ఏక్షణాన్నయినా తనను చూడ్డానికవకాశం వుంది. అందుకని ఇప్పట్నుంచి చూడ్డం మొదలెట్టాడు. అలా తీక్షణంగా చూడ్డంతో కంట్లో కారం పోసుకున్నంతగా మంటలు లేచాయి. అయినా శక్తిని పుంజుకుని కళ్ళు ఇంతలింతలు చేసుకుని అనిమేషంగా చూడసాగాడు. ఫలితంగా, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఎంత దాచుకుందామన్నా ఆగలేదు. కళ్ళు మూసీముయ్యగానే, సర్వర్ తెచ్చి, బల్ల మీద తనకు తెలియకుండా ఉంచిపోయిన కాఫీలో కన్నీటి చుక్కలు, బొటబొటా పడ్డాయి.

ప్రేమారావు సూరేకాంతాన్ని చూస్తున్నంత సేపూ ఏదో రాస్తూనే వుంది. సమయానికి అతను కళ్ళొత్తుకొంటున్నప్పుడే తలెత్తి చూసింది. ఇంక అతని అవస్థ చూడాలి.., చచ్చినంత పనయింది.

అట్లు కన్నీరుమున్నీరుగా విలపిస్తున్న ప్రేమారావును చూసి జాలిపడింది సూరేకాంతం! పాపం, పోయినవాళ్ళు గుర్తొచ్చి వుంటారనుకుంది. సానుభూతిగా చూసింది.

''హలో.!'' అంది ఇంగ్లీషులో.

గబగబా కళ్ళు తుడిచేసుకుని, వణుకుతున్న చేతుల్తో కాఫీకప్పు నోటి దగ్గరుంచుకోబోయాడు ప్రేమారావు.

నో..నో.. అది స్పెషల్ టియర్స్ కాఫీ. ఇది తీసుకోండి.'' అంటూ తన కప్పును అతని చేతిలో పెట్టింది.

ప్రేమారావు ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. తన అదృష్టాన్ని అభినందించుకుంటున్నాడు. తెల్లగా పాలనురగలా నాజూగ్గా, జాజిమొగ్గలా వున్న సూరేకాంతం తనను ప్రేమిస్తోంది! ఎంతదృష్టం, ఎంతదృష్టం!! తామింక చేయిచేయి పట్టుకుని అందర్లోనూ తిరుగుతారన్నమాట! చలం దగ్గర కెళ్ళి కరచాలనం చేస్తాడు. చూ, ద్రా కుంకా, ప్రేమారావంటే ఏంటనుకున్నావ్.. అన్నట్టు చూస్తాడు! అందరూ అసూయపడుతూ వుండగా ఇద్దరూ కలిసి విలాసంగా తిరుగుతారు! రేపటి నుంచి షికార్లు ఎల్లుండి నుంచి సినిమాలు, ఆ తర్వాత పె..!

అక్కడి దాకా వచ్చిన ఆలోచనకు బ్రేక్ పడింది. సూరేకాంతం గురించి ముందుగాతే ఆరాతీసి ఇనడ్వాన్సుగా ప్రేమించేసి వుండడం వల్ల అతనికిప్పుడెంతో హాయిగా వుంది. వాళ్ళు అరవ వాళ్ళయినా తెలుగుకొద్దిగా వస్తుందని చెప్పాడుగా జ్ఞానసంబంధం. ఫరవాలేదు. అంతగా అయితే అమ్మానాన్నా కాదంటారు. ఆతర్వాత తనే త్యాగం చేసేసి యిల్లూ వాకిలీ వదిలి సూరేకాంతంతో, వేరుండిపోతాడు. అదో ఆనందం! సూరేకాంతాన్ని ప్రేమించిన సూరేకాంతుడు. అంతగా తనను కోరుకుంటున్నప్పుడు ఆమాత్రం త్యాగం చేయకపోతే ఎట్లా...?' అని తనను తాను సమాధానపరుచుకొన్నాడు.

''కాఫీ అంతా వళ్ళో వలకబోసుకున్నారు!'' అందామె చక్కని ఇంగ్లీషులో.

అప్పటిగ్గాని తన పరిస్థితి అర్థం కాలేదు. ఉలిక్కిపడి లేచి దులుపుకున్నాడు. అయినా తడిచిపోయి అసహ్యంగా తయారయింది. జేబురుమాలు కప్పుకుర్చున్నాడు.

మర్యాదగల పిల్ల, అందుకే సూరేకాంతం నవ్వలేదు, ప్రేమిస్తే ఇలాంటి పిల్లనే ప్రేమించా లనుకున్నాడు. సర్వారావు బిల్లుతో ప్రత్యక్షమై మరో రెండు కాఫీలకి ఆర్డరు తీసుకుని, ఆశ్చర్యపడి, ప్రేమారావు మరోసారి కోప్పడేలోగా అదృశ్యమైపోయాడు.

''అయామ్ సారీ..'' అంది సూరేకాంతం.

ఎంత చక్కని గుణం..! కాఫీ వలకబోసుకున్నది తాను. అయినా సారీ చెబుతోంది. ఎంత మంచిపిల్ల! ప్రేమిస్తే యిలాంటి పిల్లనే ప్రేమించాలి.. అనుకుంటుండగా..

''మిమ్మల్ని హోటల్లో చూసే నేనూ వచ్చాను.'' అంది సూరేకాంతం.

అలా అన్నప్పుడు చాలా స్టైలుగా వుంటానని తర్వాత అనుకున్నాడు ప్రేమారావు. లేకపోతే సర్వర్ మరోసారి రెండుకప్పుల కాఫీ తెచ్చి వుండడు!?

''అసలు మిమ్మల్నెప్పటి నుంచో కలుసుకుందామనుకుంటున్నాను.. అయినా సమయం సందర్భం సమకూడలేదు.''— ఇది సూరేకాంతం ఇంగ్లీషుకు తెలుగు.

ప్రేమారావు ఉబ్బితబ్బిబ్బయిపోయాడు. అతని సంతోషానికి మితం లేకుండాపోయింది. గాలిలో ఎగిరిపోతున్నట్టనిపించింది. అలా అలా మేఘాల్లో దోబూచులాడుతున్నట్టు, చంద్రుడితో సరాగాలాడుతున్నట్టు పారవశ్యం చెందుతున్నాడు. తాననలు కుర్చీలో కూర్చున్నాడా అని అనుమానం వచ్చింది. కాళ్ళు దబదబా నేలకేసి కొట్టాడు. 'అబ్బా' అని సూరేకాంతం బాధగా ఎందుకు మూలిగిందో అతనికి అప్పటికీ తెలియదు!

సూరేకాంతానికి సమాధానం చెప్పడానికి గొంతులో నుంచి మాటలు పైకి రావడం లేదు. గుటకవేసి మాటల్ని మింగేస్తున్నాడు. అతని ముఖ కవళికల్ని బట్టే ఆమె సమాధానం ఊహించుకుంటూ వుంది!

అదే సమయానికి జ్ఞానసంబంధం అక్కడికొచ్చాడు. ప్రేమారావు భుజం పట్టుకు కుదిపాడు. ప్రేమారావు కంగారు పడి, తేరుకుని వెలుగుతున్న కళ్ళతో గర్వంగా చూశాడు, చూడవోయ్ నా ప్రతాపం, అన్నట్టు. 'కూర్చో..వస్తా వుండి' అన్నాడు పొడిగా నిర్లక్ష్యంగా.

సూరేకాంతం రెప్ప వేయకుండా జ్ఞానసంబంధాన్ని చూస్తోంది. కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయి మూలనున్న బల్ల దగ్గర కుర్చీలో వెనక్కితిరిగి కూలబడ్డాడు జ్ఞానసంబంధం. 'భగ్నప్రేమికు డిలా? వెధవ, ఓర్చుకోలేక, ఏడుపు!' అనుకున్నాడు ప్రేమారావు కసిగా.

జ్ఞానసంబంధం రావడంతోనే, తమను చూడటంతోనే ప్రచారమైపోతామని, సూరేకాంతం ఎక్కడ భయపడిపోతుందోనని.

''మరేం ఫరవాలేదు, నా డియరెస్ట్ వాడు, ఒకళ్ల మాట పట్టించుకోడు, తన పనేదో తాను చేసుకుపోతాడు, ఎవరితోనూ ఏమీ చెప్పేరకం కాదులే..'' అంటూ లోలోపల తిట్టుకుంటున్నా, - జ్ఞానసంబంధం గుణగణాన్ని సూరేకాంతం ముందుంచి, ఎవరితోనూ చెప్పడులే అనే భరోసా ఇచ్చి తృప్తిపడ్డాడు

''మీరూ తెలుగువాళ్ళేనా?'' అంది సూరేకాంతం పచ్చి తెలుగులో ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ? (ప్రేమారావు తెలుగువాడు కాదని ఆమెకు ఎవరో చెప్పి వుండాలి!)

జ్ఞానసంబంధంతో మాట్లాడ్డంవల్ల అతను తెలుగువాడని కనిపెట్టేసింది. భలే చలాకీ పిల్ల, అని లోలోపల సూరేకాంతం తెలివితేటల్ని; మాటల్ని అభినందిస్తూ, ప్రేమిస్తే ఇలాంటి పిల్లనే ప్రేమించాలను కున్నాడు ప్రేమారావు మరోసారి.

''అవును..'' అన్నాడు కొంచెమాగి.

''మీకూ తెలుగు వస్తుందని విన్నా..'' అన్నాడు ధీమాగా.

''ఎవరు చెప్పారు?''

''జ్ఞానసంబంధం, నా డియరెస్ట్ ఫ్రెండ్..''

''ఓహో..''అంది సూరేకాంతం, అలా అన్నప్పుడు ఆమె ముఖం ఆనందంతో వెల్లివిరిసింది.

''మీకు తెలియ దనుకుంటాను. ఇంకా మీ గురించి చాలా చెప్పాడు. చాలా తెలుసు కున్నాను'' అన్నాడు ఆనందం పట్టలేక.

చూశావా, నిన్నెప్పటి నుంచో ప్రేమిస్తూ జాబితాలో చేర్చుకుని దరఖాస్తు పారేసి వుంచాను. ఇన్నాటికి ఇంటర్వ్యూ దొరికింది అని అతని భావార్థం!

''చాలా థేంక్స్..'' అంది సూరేకాంతం.

థేంక్స్ ఎందుకు చెప్పిందో ముందు ప్రేమారావుకు అర్థం కాలేదు. ఇంత ఇంఫర్మేషన్ ముందుగా సంపాయించి తెలివిగా ప్రేమాయణం మొదలుపెట్ట నందుకు అభినందిస్తోందని సరిపుచ్చు కున్నాడు. అమితానంద భరితుడయ్యాడు.

''ఫ్రెండ్సంటే అలా వుండాలి. ఇలా నారాయణమ్మలా తలో ఒకదారి అయితే సంఘీభావం ఎక్కడుంటుంద చెప్పండి, ఒకళ్ళనొకళ్ళు బాగా అర్థం చేసుకుని, తనువులు వేరైనా మనసులు ఒకటేలా అన్నట్లుండే వాళ్ళే సిసలైన మనుష్యులు. ప్రపంచమంతా సర్వమానవ సమానత్వం అనే ఆదర్శం మీద నడుస్తోంది. పాకిస్తాన్, చైనాల్లాంటి వాళ్ళు నియమాల్ని ఉల్లంఘిస్తున్నారనుకోండి. అటువంటి వాళ్ళని వేరుపురుగుల్లా ఏరిపారేయాలి. అప్పుడు నేషనల్ ఇంటిగ్రేషన్ బలపడుతుంది.



# ప్రేమారావు

శాంతి జీవనానికి నాందీవాచకం అవుతుందా? విదేశీ సహాయం లేకుండా మనదేశ ఆర్థిక పరిస్థితి బాగుపడుతుందంటారా? ప్చ్... ఒక దేశానికి మరో దేశం సహాయం కావాలి. ఒక మనిషికి మరో మనిషి సహాయం కావాలి. అందరరూ సౌభ్రాతృత్వంతో ముందడుగు వేయగాలి. అభ్యుదయం సాధించాలి. దేశం పురోగమనానికి మెట్లెయ్యాలి. స్నేహశీలత, సోదరభావం, పరోపకార పరాయణ ఉన్నవాళ్లంటే నేను పడి ఛస్తాను..! ఇహిహి.. మీరూ అలాంటి వాళ్లనని ఇప్పుడే తెలుసుకుంటున్నా." అని నో..సిగ్గుపడిపోయింది సూరేకాంతం.

ఇంత లావుపాటి ఉపన్యాసంలోను ప్రేమారావుకు ఒక్కముక్క కూడా అర్థం కాలేదు. సూరేకాంతానికి పాలిటిక్స్ దగ్గర్నుంచి అన్నిరకాల వివేకమూ, జ్ఞానమూ వుందని ఆ వుపన్యాస సారాంశంగా ఎంచుకుని ఇంత పరిజ్ఞానమున్న పిల్లనుపెళ్లాడితే లాభిస్తుందే... అనుకొన్నాడు.

ఇప్పుడు ఏదో సమాధానం చెప్పాలి. ఉపన్యాసం చూపుందవాలి. ఛలో చప్పగా మాట్లాడరావాలి. ఇందిరాగాంధి అంతటిదానివవుతావనాలి. లేకపోతే బాగుండదు.

"మీరు నాకు ఎప్పటి నుంచో తెలుసు మీరు అరవవాళ్లే.."

"వ్వాట్..?"

"అయామసారీ.!"

అసలు ప్రేమారావు మాట్లాడుదామనుకున్నది వేరు. ప్రాధీనం తప్పిన నోరు జారింది వేరు.

"అదేలెండి.. మీరు పుట్టింది మద్రాసులోనేనని.. మీకూ తెలుగు వచ్చిందనీ.. నాకు ముందుగానే తెలుసు. జ్ఞానసంబంధం నాకంతా చెప్పాడు. చెప్పండి, మీ కెటువంటి సహాయం కావాలన్నా చేయడానికి సిద్ధంగా వున్నాను. మీ కోసం.." ఒక్కగుక్కలో మాట్లాడేవాడు, జ్ఞానసంబంధ పేరొచ్చినప్పుడు ఒత్తి పలుకుతూ.

"ఆ బ్రాట్, జ్ఞానసంబంధానికి నా విషయమెలా తెలుసు?" అని మద్భుతం ఒక్కసారంటుందేమో సంబరపడిపోదును అనుకున్నాడు. కాని అలా అనకపోయేసరికి నిరుత్సాహపడ్డాడు. అరవవాళ్లని అంటు

న్నప్పుడు ఆమె అలా అరవడానికి కారణ మేమిటో మాత్రం అతనికి బోధపడలేదు.

"మీ మంచి తనం నాకు తెలుసు. మీమీద నమ్మకం వుంది. అందుకే ఇవ్వేళ ధైర్యంగా వచ్చి మిమ్మల్ని కలుసుకోగలిగాను. మీరింత మంచివారని, సహాయపరులని ముందుగానే తెలిసి వుంటే ఎప్పుడో వచ్చి కలుసుకుని వుండేదాన్ని. అనవసరమైన భయంతో వెనకా ముందూ ఆడి, కాలాన్నంతా వ్యర్థం చేసుకున్నాను. అందుకిప్పుడు ఎంతో చింతి స్తున్నాను. పోనీలెండి గత జలసేతు బంధనమ్..! నేను.. మిమ్మల్ని.. మిమ్మల్ని.." అంటూ ఏదో చెప్పబోయి, అమాంతం సిగ్గు పడిపోయి, ఇక నోటితో చెప్పలేక, ఇప్పటి వరకు రాసి ముగించిన కాయితాన్ని అతని చేతుల్లో పెట్టింది.

షాక్ నుంచి తేరుకుని, ఒకవైపు తెల్ల బోతూ, మరోవైపు ఆనందాశ్చర్యాల్లో మునిగిపోతూ, కలో, వైష్ణవమాయో తెలి యని అయోమయ అవస్థలో వున్న ప్రేమారావు, యాంత్రికంగా కాయి తాన్ని విప్పి అందులో అక్షరాలు కని పించక పోవడాన్ని చూసి హాచ్చర్యపోయాడు.

కాయితంలో మారేకాంతం తప్పితే ఒక్కక్షరం కూడా లేదు!

"చదవండి.. మనసులు తెలుసుకున్న తర్వాత మనలో మనకి భేదాలేవిటి?" అంది, మారేకాంతం జ్ఞానసంబంధాన్ని కనిపెడుతూ, ప్రేమారావుతో మాట్లాడ తున్నా ఆమె రెండు కళ్ళూ జ్ఞానసంబం ధాన్నే అతుక్కుపోయాయి!

అప్పటికి, కాయితంలో మారేకాంతం మాయమై, అక్షరాలు కన్పించాయి. ఒక లైను చదివి, అమాంతం సిగ్గుతో ముడు చుకుపోయాడు ప్రేమారావు.

"ఫరవాలేదు చదవండి, పూర్తిగా చదివే యండి, అప్పుడుగాని నేను ఎన్నాళ్ళుగా పరితపిస్తున్నానో అర్థంకాదు!.." అని ప్రోత్సహించింది.

అది లవ్‌లెటర్. అందులోని ఒకో అక్షరమూ ప్రేమారావును ఏదోఏదో చేసేస్తోంది. మన్మథుడికి పంచబాణాలు అన్నది శుద్ధ అబద్ధం. పుత్తరంలో వున్న అక్షరాలన్నీ మన్మథబాణాలే! —

"ప్రియతం,

"ఇంత ధైర్యం చేసినందుకు మన్నిం చండి. ఏ ఆడదీ ఎదురుపడి మిమ్మల్ని ప్రేమిస్తున్నానని నోటితో చెప్పలేదు.. మీరు రోజూ పనిమీదంప కేఫ్ వెళ్తూ వస్తూ వున్నారు. మీరు గస్తీ తిరుగుతున్న సమ యానికి గుమ్మం దగ్గర నిలబడి మీ కోసం నేను ఎదురు చూస్తూ వుండడం, అదే పనిగా మీరు చూపులబాణాల్ని విసురుతూ వుండ డం, మీ చూపుల్లోని అంతరార్థం, ఆతర్వాతి పరమార్థం నేను గ్రహించకపోలేదు. నేను మిమ్మల్ని ఎన్నాళ్ళ నుంచో ప్రేమిస్తు న్నాను. ఎంత గట్టిగా ప్రేమిస్తున్నానూ అంటే దానికి ఉదాహరణ లేదంటే నమ్మండి. మీ నడవడిక ద్వారా మీరూ గట్టిగానే ప్రేమిస్తున్నట్టు అర్థం చేసు కున్నాను. మీ ఎదురింటి మీనా మీతో మాట్లాడుతుందిటగా. మీ గురించి అన్ని విషయాలు నాకు చెప్పిందది. మీ ముందుకు వచ్చి నా ప్రేమ సంగతి వెల్లడించి మీలో కలిసిపోవాలని ఎన్నాళ్ళనుంచో ఉవ్వి ళ్ళూరుతున్నాను. అమ్మానాన్నల అదుపుల్లో వున్న నాకా అవకాశం ఈనాటికి గాని చిక్క లేదు. అయినా నోటితో చెప్పలేక ఈ ఉత్త రం ద్వారా నా ప్రేమను వ్యక్తం చేస్తు న్నాను. ఇవ్వేళ సాయంత్రం సరిగ్గా ఎడు గంటలకి బీచ్‌లో ఎదురు చూస్తుంటా. నిత్యమూ మిమ్మల్నే తలుచుకుంటూ ఆరాధిస్తున్న నన్ను, నా ప్రేమను స్వీక రిస్తారు కదూ..!

మీ పేద పాదదాసి, సత్యసూర్య వీర వెంకట మారేకాంతం" అని వుంది పుత్త రంలో.

ఇంకేముంది! ఆ నాటికి ప్రేమారావు అనే వాడు కూడా ప్రేమపాత్రుడైనాడని, పేరు సార్థకం చేసుకున్నాడని, అందరి లోనూ తలెత్తుకు తిరగ్గల్గుతాడని, చలం గాడికి సమాధానం చెప్పగలడని, కనబడ్డ ప్రతివాడికీ కాఫీలు పోయించక్కర్లేదని ఉబ్బితబ్బిబ్బయి పోయాడు.

తల పైకెత్తి, జ్ఞానసంబంధం తననే పరిశీలిస్తూ వున్నట్టు గమనించి, ఒకసారి సగర్వంగా తల విదిలించి, రెండు వేళ్ళతో అలా అల సుతారంగా జుట్టు సవరించుకొని, చూడవోయ్ నా తడాఖా అన్నట్టు విజయ వంతమైన చిరుదరహాసం వలకబోసి హుందాగా చూశాడు.

జ్ఞానసంబంధం మొహం మాడి చిన్న దోయింది. గడ్డం సరిచేసుకున్నాడు పాలో వనగా.

రోగం కుదిరిందనుకొంటూ మురిసి ఆనందించాడు ప్రేమారావు.

సర్వర్ తెచ్చిన కాఫీ తాగిన తర్వాత "ఇస్తారు కదూ..?!" అంది లేవబోతూ మారేకాంతం.

"ఓ..." అన్నాడు మెరితిరిగిపోతూ ముద్దుగా మొహాన్ని కుదించిన ప్రేమారావు.

"అదిగో.. ఎలా కూర్చున్నారో చూడండి. గుండె తరుక్కుపోతోంది. పవిత్రంగా ప్రేమించిన నేను నిర్దాక్షిణ్యంగా వూరు కుంటే ఏం బావుంటుంది చెప్పండి? ఆయన తీరు చూసే ఇవ్వాళ తెగించి, మీ ద్వారా ఈ లేఖ నందజేయాలని..." ఇంకా ఇంకా ఏదేదో రహస్యంగా చెప్పింది మారేకాంతం.

ప్రేమారావు తల తిరిగిపోయింది.

ఆ తర్వాత—

మారేకాంతం జ్ఞానసంబంధం వైపు తిరిగి సన్నగా నవ్వడం, ప్రేమారావు చేతిలో ఉత్తరాన్ని చూపించి సిగ్గుతో మొహం చాటు చేసుకోవడం, సర్వర్‌కు మరో రెండు కప్పుల కాఫీకి ఆర్డరిచ్చి, రెండు పగిలిన కప్పుల వెలతో కలిపి మొత్తం వేసిన బిల్లును కౌంటర్‌లో చెల్లించి, ఎవరికీ తెలియకుండా జ్ఞానప్రకాశానికి 'టాటా' సిగ్నలిచ్చి వెళ్ళిపోవడం—ఇవన్నీ చిటికెలో జరిగిపోయాయి.

ప్రేమారావుకు ఇవేమీ తెలియదు.. అతను మనుషుల్లో లేడసలు.

జ్ఞానసంబంధం మెల్లగా ప్రేమారావు దగ్గరకొచ్చాడు. బిర్ర బిగుసుకుపోయిన ప్రేమారావు వేళ్ళలో నుంచి ఉత్తరాన్ని లాక్కుని చదువుకున్నాడు. అతని ముఖం చాపంతయింది. ప్రేమారావును గట్టిగా కవుగలించుకోబోయి ఎదురుగా వున్న కాఫీని చూసి ఆగిపోయాడు. కాఫీని గడగడా తాగేసి, ప్రేమారావును గట్టిగా కుదిపాడు. ప్రేమారావు చివరికి ఈ ప్రపం చానికి తిరిగొచ్చాడు. వచ్చి,

"మారేకాంతం హరవ ఫిల్లారా???" అని నోరు చించుకుని ప్రశ్నించాడు.

ఇన్ని కాఫీలు తాగితే పైత్యించదా అన్నట్టు చూశాడు సర్వారావు! ●

## పెద్దకథ:




**పి.యస్.నారాయణ**

## 3

పదకొండు గంటలయింది.

కోపంతో వున్న అరుణకు రాజశేఖరం గదిలో కాలు పెట్టటం అంటేనే అసహ్యమేసింది. 'ఎందుకు అలాంటి వ్యక్తి కోసరం తను తాపత్రయపడాలి' అనుకున్నది.

కాని—సూర్యుడు నడివెత్తి మీద కొస్తున్న కొలది ఆమెలోని కోపం మంచులా కరిగిపోయి దానిస్థానే జాలి ఉద్భవించ సాగింది.

దానికి తోడు డాక్టర్ వెళుతూ వెళుతూ రాజశేఖరానికి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చినయ్. బాగా తడవటంతో జల్బుబ మీద జ్వరం వచ్చింది.. చాలా జాగ్రత్తగా వుండండి.. అవి ఇలితిని ఏన్యుమోనియా లోకి దింపించుకున్నారంటే తరువాత ఎక్కువరోజులు బాధపడగలసి వస్తుంది!''

ఒక్కక్షణం—అక్కయ్యను రమ్మనమని వ్రాద్దామా—అని అనుకున్నది.

అక్కడ ఆమెకు ఎలా వున్నదో?

అతడి గదిలో కాలుపెట్టి, ''ఆకలవుతున్నదా?'' అని అడిగింది.

''ఇప్పుడు టైం ఎంతయిందో నీకు తెలుసా?'' తీక్షణంగా చూస్తూ అడిగాడు రాజశేఖరం.

''పదకొండు గంటలయి వుంటుంది!''

''పదకొండు గంటలయినా ఆకలిగాకుండా ఏలా వుంటుందనుకున్నావ్?''

''ఆకలయినప్పుడు అడగవచ్చు గదా?'' నుదురు చిట్లించి అన్నది.

''అడగందే యివ్వదలుచుకోలేదా?''

''అడగందే మీకేం కావాలో నాకెలా తెలుస్తుంది?''

''రోగిష్టి మారి వాడికి ఏం కావలో తెలుసుకునేటంత లోకజ్ఞానం గూడా నీకు లేదా?'' మంచం మీద కోపంతో లేవబోయాడు.

అతడిని గంట పట్టి కడుపులో పేగులు కొరుక్కు తింటున్నయి.

కాని అరుణను పిలిచి అడగటానికి అహం అడ్డపడింది. ఆమె లేనిదే, ఆమె ఆసరా లేనిదే ఒక్కక్షణం గడవదనే ఆపోహ ఎక్కడ ఆమె పడుతుందోనని!

కాని ఆమె బాధ అతడికి అర్థంగాదు.

అరుణ గిరుక్కున వెనక్కు తిరిగింది.

ఫ్లాస్కులో కాఫీ గాజుగ్లాసులోకి వంచి తీసుకువచ్చి రాజశేఖరం మంచం పక్కకు స్టూలు లాగి దాని మీద మోత అయ్యేలా పెట్టింది.

అతడు లేచి కూర్చొని త్రాగసాగాడు.

''అక్కయ్యను రమ్మనమని వ్రాద్దామనుకుంటున్నాను!'' అరుణ తలవంచుకొని అన్నది.

పెదాల దగ్గర పెట్టుకోబోతున్న గాజు గ్లాసును వెనక్కు తీసుకొని, తలెత్తి, కళ్ళు పెద్దవి చేసుకొని ఆమె మొఖంలోకి చూస్తూ ''నీకు ఇలాంటి పనులు చేయాలంటే బాధగా వున్నదా? చెప్పు అరుణా!.. చెప్పు!... నాకు ఎవరి ఆసరాను అక్కరలేదు..నీ కంత కష్టంగా వుంటే చెప్పు.. ఏ ధర్మాసుపత్రి

లోనైనా జేరుతాను.. అంతేగాని..!'' అతడి మొఖం కందగడ్డలా మారింది. అతడి పెదాలు వణుకుతున్నాయి.

"ఏ దుకు లేనిపోనివి కల్పించుకొని, మీరు బాధపడి నన్ను బాధపెడతారు?'' అన్నది తీక్షణంగా కంఠం హెచ్చించి "అరుణా

"నేను బాధపడితే ఏడుతున్నానేమోగాని, నిన్ను మాత్రం బాధపెట్టటం లేదు!'' అతడూ తీక్షణంగానే అన్నాడు.

"చేసేవన్నీ చేస్తూ... ఈ అనవసరపు మాటలు దేనిచి?''

"ఏం చేశాను?'' లేవబోతున్నట్టుగా ముందుకు వంగి అన్నాడు.

"ఏం చేశారు మీకు తెలుసు, నాకు తెలుసు... ఎందుకు నన్నిలా బాధపెడతారు? నేను మీకేం అపకారం చేశాను?.. నన్ను ఇంతగా హింసించటం వలన మీరు పొందే ఆనందమేమిటి?'' ఉక్కిరి బిక్కిరి అయ్యేలా అడగదల్చుకున్నవన్నీ అడిగివేసింది.

గిరుక్కున వెనక్కు తిరిగి, లోపలకు పోబోయింది.

"అరుణా! రాజశేఖరం కంఠం ఆమె కాళ్లకు బంధాలు వేసింది.'' ఆగు అరుణా!

తీక్షణంగా చూడసాగింది రాజశేఖరం మొఖంలోకి.

"ఏమన్నావ్...మళ్లీ అను... నా మూలకంగా నీవు...

"అవును, ముమ్మాటికీ నిజం!..మీరు నన్నూ, నా హృదయాన్ని చిత్రహింస చేస్తున్నారు.. గుండెల్ని రంపంతో కోసి, నెత్తురు విరజిమ్ముతున్నారు... నరనరాల్ని పట్టుకు బయటకు లాగి మెలిపెడుతున్నారు. నన్ను ఒక మనిషిగాను, మానవత్వమున్న స్త్రీగానూ అసలు గుర్తించటమే లేదు.. ఏదో ఆగ్బర శత్రువులా..'' తరువాత ఆమెకు నోటి వెంట మాట పెగల్లేదు. తడబడింది. కోపంతో ఒణికిపోయింది. తల విసురుగా విదిలించి పక్కగదిలోకి వెళ్లబోయింది.

రాజశేఖరానికి మొఖాన చాచికొట్టినట్లని పించింది. మనిషి ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

మరుక్షణంలోనే ఆమె చెమటలు పట్టిన మొఖం కళ్ళ ముందు కదలగా, లేచి వడివడిగా ఆమె గదిలోకి వెళ్ళ బోయాడు.

కాని ఏదో తెర — మత్తులాంటి తెర ముందు అడ్డంగా నిలబడింది. కాళ్లను ఎవరో కట్టివేశారు. తల విదిలించి, కదల కుండా కూర్చొని "గోపన్నా'' అని పిలి చాడు.

తర వాత కొన్ని నిమిషాలకు వచ్చిన గోపన్నతో, "చిన్నమ్మగారు ఏం చేస్తున్నారో చూడు!'' ఆతృతగా అన్నాడు.

గోపన్న లోపలకు వెళ్లిన వైపే చూస్తూ, తనూ లేవవల్సి వస్తుందన్నట్లుగా పక్కె మీద ముందుకు వంగి కూర్చున్నాడు.

తిరిగివచ్చిన గోపన్నను చూస్తూనే లేవ బోయాడు.

"వంటింట్లో స్టౌ వెలిగిస్తోంది!''

అతడి మొఖం బిగుసుకుపోయింది!

అరుణ భయాన్ని, కోపాన్ని జయించింది!

* * *

మూడురోజుల తరువాత —

రాత్రి పదిగంటలప్పుడు —

గదిలో గుడ్డి దీపం వెలుగుతోంది.

రాజశేఖరం పర్యం వరచి — అపస్మారక స్థితిలో అప్పటికి రెండురోజుల బట్టి పడుకొని వున్నాడు.

డాక్టర్ సలహాతో— అరగంటకీ, గంటకీ — అతడు నోరు తెరిచి మూలుగుతున్న సమయంలో అరుణ చెంచాతో గ్లూకోజ్ నీళ్లు పోసేది.

ఆమెకీ ఈ రెండురోజుల బట్టి ఆహారం లేద . నీళ్ళు లేవు. నిద్రలేదు. గోపన్న దూరంగా కళ్లార్పకండా చూస్తూ కూర్చొని వున్నాడు.

ఈ పరిస్థితుల భయంతో కొట్టుకు లాడుతుంది అరుణ. రెండురోజుల క్రితమే అరుంధతికి ఉత్తరం వ్రాద్దామనుకుం టుండగా ఆమె వద్ద నుండే జాబు వచ్చింది.

అందులో ఇలా వున్నది.

"చెల్లీ!

మా అత్తగారు మొన్నరాత్రి పన్నెండు గంటల సమయంలో, అనారోగ్యంతో కొన్ని దినాల బాధపడిన తరువాత కన్నుమూశారు. ఆ రోజు ఉదయం నుండి కాస్త తేరిగ్గా వుండటంతో మేం ఎంతో తృప్తిపడి తేలిగ్గా శ్వాస పీల్చుకున్నాం. కాని అనుకో కుండా ఆ రాత్రి ఆనె వెళ్లిపోయింది.

ఇక, నేను ఇక్కడ పనులన్నీపూర్తయితే గాని రాలేను. సుమారుగా పది, పదిహేను రోజులు పట్టవచ్చు.

మా బావ ఏమంటున్నాడు? నేను వచ్చే ముందు నీక చెప్పినట్లుగా— అతడిని మలుచుకోవటం నీ చేతిల్లోని పని అరుణా! అంతేగాదు —పురుషుణ్ణి అత్యున్నత స్థానానికి తీసుక వెళ్లినా, అధః పాతాళానికి త్రొక్కివేసినా — ఒక్క స్త్రీయే చేయ గలదు:

అతడు పిచ్చివాడు. అమాయకత్వం ఇంకా వీడలేదు. ఆ అమాయకత్వమే అతడిని పెంకివాడుగా గూడా చేస్తోంది.. పిచ్చితనంతో గూడిన పెంకితనంతో ఏవేవో వాగవచ్చు— వాటిని నీ వేవీ లెక్కించవద్దు. అతడు నీవాడు నీ సామ్మను నీ కెంత జాగ్రత్తగా చూచుకుంటావో, ఎంతగా భద్రపరుచుకుంటావో— అతడి విషయం లోనూ అలాగే ప్రవర్తించు!

నీకు భగవంతుడు ఎల్లప్పుడూ అండ దండగా నిలుస్తాడు. నీ జీవితం సుఖ వంతమవుతుంది.

ఇట్లు

నీ శ్రేయస్సు కోరే నీ అక్క

అరుంధతి''

ఆమె ఉత్తరంచదివి క్షణంలో హేళనగా నవ్వుకున్నది.

మరుక్షణంలోనే —

ఆవేశంతో హృదయం ఎగిరెగిరి పడింది.

తన కిష్టంలేని వ్యక్తితో తన జీవితం ఏలా గడపగలదు ...

తనను రాజశేఖరం ఇష్టపడటం లేదని తెలిసే ఇంకా అరుంధతి ఆ ఉద్దేశ్యంతోనే ఎందుకున్నది

దానివల్ల ఎవరికి లాభం .

ఉహూ.......

ఇవన్నీ ఆలోచించవలసి సమయం దాటి పోయింది —ఎన్నడూ తన హృదయాన్ని అతడికి అర్పించివేసింది —ఇప్పుడు అక్కయ్య కోరినట్లుగా అతన్ని తన వైపు త్రిప్పు కోవటమే తన వాడిని చేసుకోవటమే — తన విధి! తన చేయవల్సిన పని!

ఇక ఏ ఆలోచనా వద్దు!

రాజశేఖరం మూలిగాడు. అటూయిటూ బాధగా కదిలాడు. అరుణ లేచి, గ్లూకోజ్ నీళ్లున్న గ్లాసు చేతిలో తీసుకున్నది. చెంచాతో నీళ్ల నోట్లో పోయబోయింది

"ఆకలవుతుంది.. కాసిని కాఫీ ఇవ్వ రాదూ!''

అరుణ పక్కనున్న ఫ్లాస్కు మరుక్షణం లోనే చేతిలోకి తీసుకున్నది.

గ్లాసులో పోసి, "లేచి కూర్చో లేరు.. చెంచాతో పోస్తాను!'' అన్నది.

"నీ యిష్టం!'' నూతిలో నుండి వచ్చి నట్లుగా వున్నాయి మాటలు. ఒకగుక్క కాఫీ త్రాగాడు. గొంతంతా ఎండి గరగర

లాడుతోంది.

"నీ కళ్ళు అంత ఎర్రగా వున్నయ్యేం!" అంత నీరసంలోనూ కళ్ళు చిట్లించి చూస్తూ అడిగాడు.

అతడి ప్రశ్నకు ఆమె కళ్ళమ్మట నీళ్ళు గిర్రున తిరిగినయ్.

"ఏడుస్తున్నావు గూడానా?..ఏమైంది?.

"నాకు భయమేస్తోంది!"

"నేను చచ్చిపోతాననా?" పేలవంగా నవ్వాడు.

అతడి మాటలకు మరింత భయంతో ఆమె ముఖం బిగుసుకు పోయింది. నోట మ్మట మాట పెగలక అచేత నయింది.

"పిచ్చిదానా!...... నేను చచ్చిపోతే నీకు దేనికి భయం!" మళ్ళా నవ్వటానికి ప్రయత్నించాడు.

ఆమె కళ్ళల్లోకి జాలిగా చూచాడు.

"ఛా! భయపడకు...... ఇది మొండి పిండంలే.... అంత త్వరగా చావదు!'

అతడి మాటలకు మరింత భయ పడింది.

"జ్వర తీవ్రత వలన కాదుగదా..... ఈ పిచ్చి పిచ్చి మాటలు!"

గ్లాసు అక్కడే పెట్టి, ముఖం పక్కకు తిప్పుకొని, దుఃఖాన్ని దిగమింగుకుంటూ, లేచి వెళ్ళబోయింది.

"ఆగు అరుణా!...... భోజనం చేశావా?" చాలా నెమ్మదిగా అడిగాడు.

"లేదు!"

"ఏం?.."

"రెండురోజుల బట్టి అమ్మగారు మంచి నీళ్ళయినా ముట్టటం లేదు బాబూ!" గోపన్న అన్నాడు.

తల పక్కకు వాల్చి, గోడ ప్రక్కగా కూర్చున్న గోపన్న మొఖంలోకి ఒక్కసారి చూచి, అరుణ మీదికి చూపు మరలుస్తూ, "ఏం అరుణా?.. ఎందుకని?" ఆత్రుతగా అడిగాడు.

"రెండురోజుల బట్టీ మీకు స్మారకమే లేదు!"

"నిజంగానా?"

"అవును!"

ఒక్కక్షణం నిశ్శబ్దంగా శూన్యంలోకి చూసి, కృతజ్ఞతాపూరిత కంఠంతో, నంగి నంగిగా, "కృతజ్ఞుణ్ణి అరుణా!.. నీవు చేసిన సహాయానికి, నీవు చూపిన ఆదరానికి కృతజ్ఞుణ్ణి.. ఎప్పుడో అప్పుడు నీ ఋణం తప్పక తీర్చుకుంటాను!" అన్నాడు.

అక్కడ నిల్చోటం ఇష్టం లేనట్లుగా వెళ్ళిపోతూ, అరుంధతి వ్రాసిన ఉత్తరం గుర్తుకు రావటంతో వెనుతిరిగి, "అక్కయ్య ఉత్తరం వ్రాసింది... అత్తగారు పోయారట... పది పదిహేను రోజుల్లో వస్తా నన్నది!"

"అరె పాపం!" నిట్టూర్పు విడిచాడు.

"ఇదిగో.. మీకు ఒకటి వ్రాసింది!"

"చింపి చదువు..."

"మీరు చదవండి లే.. " ఆమె గుండె దడదడ లాడింది—దానిలో ఏ వున్నదో?

కవరు చింపి, కాగితం మడతను మడత గానే వుంచి అతడి చేతికిచ్చింది.

"బావా!

అరుణ నీది.. ఆమెను సంతోషపెట్టినా, దుఃఖ పెట్టినా అనుభవించేది నీవే!

—అరుంధతి"

రెండే రెండు వాక్యాలు.

అతడి కళ్ళు చికాకును వ్యక్తం చేశాయి.

విసురుగా కాగితాన్ని నలిపి దూరంగా విసిరివేశాడు.

"అరుంధతి!" కసిగా అనుకున్నాడు.

అరుణ—అందులో ఏ వున్నదో క్షణంలో గ్రహించింది!

మొఖం పాలిపోగా, పక్కగదిలోకి పరు గెత్తుకుపోయింది!

* * *

ఐదురోజు అయింది.

రెండురోజుల క్రితమే జ్వరం తగ్గటంతో పత్యం పెట్టమన్నాడు డాక్టర్.

పదిగంటల కల్లా అన్నీ సిద్ధం చేసి అతడి గదిలోకి వచ్చింది అరుణ.

కొద్దిరోజుల జ్వరానికే కళ్ళు గుంటలు పడి, మొఖమంతా పీక్కుపోయింది. గడ్డం పెరగటంతో మరింతగా నీరసించినట్లు కనబడుతున్నాడు రాజశేఖరం.

జాలిగా అతడి మొఖంలోకి ఒక్కసారి చూచి కంచాన్ని స్టూలు మీద పెట్టి అన్నం వడ్డించింది.

ఒక ముద్ద తిన్న తరువాత, "నోరు ఎలా వున్నది.. తిన బుద్ధి వేస్తున్నదా?" అడి గింది.

"వూ.. అని మూలిగాడు. చిన్నగా తల గూడా వూపాడు. కాని, కాస్త తినేటప్పటికే నోటు వేసింది. ఆ కంచంలోనే చేయి కడిగేసుకొన్నాడు.

"తిన్నది కొంచెమైనా అయినా— ఎద్ర మాత్రం పోగూడదు!" అరుణ అన్నది.

"ప్రయత్నిస్తాను!"

"ప్రయత్నించటం కాదు— పోవటానికి వీల్లేదు!" ఒత్తి పలికింది.

"సరే!"

"ఏమైనా పుస్తకాలు తెచ్చి ఇవ్వమం టారా?"

"చదువలేకపోవచ్చు... కళ్ళు నెప్పులు పుడతయ్యేమో"

"నిజమే... పోనీయ్ నన్ను చదవమం టారా?" కంఠంలో సహజత్వం ఉట్టి పడింది.

కాని—అదీ అతడిని అంతగా సంతృప్తి పరచలేకపోయింది.

అరగంట చదివేటప్పటికే అతడికి విసుగు వేసింది. ఆవులింతలు పరామర్శించ సాగినయ్.

చికాకుతో, అసహనంతో అటూయిటూ కదిలాడు. అరుణ పుస్తకం మూసివేసింది.

"అరుంధతి ఎప్పుడు వస్తుంది?" ఉన్న ట్లుండి రాజశేఖరం అడిగాడు.

"ఏమో?"

"నీకు వ్రాసిన ఉత్తరంలో ఏమీ వ్రాయ లేదా?"

"అక్కడి పనులన్నీ పూర్తయిన తరువాత వస్తానని వ్రాసింది!"

"అంటే నాలుగురోజుల్లో రావచ్చు నన్నమాట!" నిట్టూర్పు విడిచాడు.

కాని ఆ నిట్టూర్పు ఆమె గుండెల్లో బాకుగా పొడుచుకున్నదని అతడికి తెలి యదు!

అరుణ మొఖం పక్కకు తిప్పుకుంటూ, "మీకీ కష్టాలు నాలుగయిదు రోజుల్లో తీరుతయి లెండి!" అన్నది.

"ఇవి కష్టాలో, సుఖాలో నాకయితే తెలియదుగాని— ఆమె రావటంతో నాకేదో తృప్తి వున్నది— అంతే!" అన్నాడు కళ్ళు సగం వాల్చి.

తృప్తి అంటూ లేనప్పుడు— ప్రతిదీ కష్టంగానే తోస్తుంది—అది సహజం గూడా!— కాదంటారా?" ఆమె ఆ సంభా షణను అంతటితో త్రుంచి వేయదలుచుకో లేదు.

"మళ్ళీ నన్ను ఆ గాడిలోకి లాగేస్తు

న్నావో!" అతడి నిరసన్మైన మొఖంలో పేలవమైన నవ్వు కొట్టవచ్చినట్లుగా కనబడింది. "ఆ వలయం నుండి మనం దూరదూరంగా తిరుగుదాం... ఈ నాల్రోజులు!" అన్నాడు. ఒక్కక్షణమాగి, పశ్చాత్తాప కంఠంతో, "అరుణా! మీ అక్కయ్య లేని ఈ కొద్ది రోజుల్లోనూ నీకు నా ప్రవర్తన వింతగాను, కఠినంగాను తోచి వుండవచ్చు.. దానికి నన్ను క్షమించగలవా?" అన్నాడు— అది, ఇద్దరు మానవత్వమున్న మనుష్యుల నడుమ నడిచే సంభాషణ!

"దాని వలన లాభం?"

"నా తృప్తి!"

"అసంతృప్తితో గడచిన రోజుల్లో విడిపోయిన సంఘటనలను మననం చేసుకొని క్షమాపణలను కోరుకోవటంలో తృప్తి గనుక మీరు పొందగలిగితే— మీరు కోరిన ప్రశ్నకు సమాధానం ఆలోచిస్తాను—, ఐతే నాకు కొద్ది టైం కావాల్సి వస్తుంది."

"నా ప్రవర్తన క్షమార్హం కాదంటావా?" తెలియని ఆదుర్దాతో ముందుకు వంగి అడిగాడు. కంఠం బొంగురుపోయింది. ఆమె మాటలు అతడిని దెబ్బ తీసినయ్.

అరుణ కళ్లల్లో నీళ్ళు చిమ్మినయ్.

"ఆనా ప్రవర్తించే సమయంలో ఈ అవసరం వస్తుందనే అనుకున్నారా?" ఓర చూపుతో రాజశేఖరాన్ని చూచింది. మసగ మసగ్గా కనబడ్డాడు.

ఆమె ప్రశ్నలు అతడి శరీరాన్ని తూట్లు పొడుస్తున్నాయి.

తడబడ్డాడు. "లేదు..లేదు!"

"మరి?"

రాజశేఖరం మాట్లాడలేకపోయాడు

అరుణే తిరిగి అన్నది. "అసలు నామీద మీ కెందుకింత ద్వేషం?.. మిమ్మల్ని హృదయంలో పెట్టుకు పూజిస్తున్న నన్ను ఎందుకు కాలితో తన్ని— అప్పుడప్పుడూ మొఖాన నీళ్ళు చల్లుతున్నారు? మీ ప్రవర్తన నా కవగతమే కావటంలేదు. వాటిది పరీక్షా?"

"..........."

"ఊహూ.. ఈనాడు మిమ్మల్ని వదల దలుచుకోలేదు.. అంతేగాదు.. నాకు జీవితంలో శాంతి కావాలనుకుంటే నాలోని కొన్ని అనుమానాలను నివృత్తి చేసుకోక తప్పదు! ఆమె మాట చాలా స్వచ్ఛంగా వున్నది.

## అరుణోదయం

అతడు బాధతోనూ, భయంతోనూ ఆమె ముఖంలోకి చూచాడు.

"చెప్పండి!.. నేనంటే మీ కెందుకింత ద్వేషం.. ఊహూ.. కప్పదాట్లు వేయవద్దు.. నిజం చెప్పండి!" తల వూగిస్తూ అన్నది.

ఆమె వెనక్కుపడి వున్న జడను ముందుకు లాక్కొని చివరలను వేలితో అటూ యిటూ కదిలించసాగింది.

"నీ వంటే ద్వేషమని ఎవరన్నారు?" తలెత్తకుండానే అడిగాడు.

"ఎవరైనా అనాలా?.. మీ ప్రవర్తనే చెబుతోంది!"

"లేదు అరుణా! లేదు.. నీ వంటే నాకు ద్వేషం లేదు.. నిన్ను ద్వేషించవల్సిన కారణం నాకులేదు! అన్నాడు త్వరత్వరగా రాజశేఖరం అబద్ధాల భవంతులను పేరుస్తూ!

"మరి?"

తటాకంలో అతి ప్రశాంతత ఏర్పడింది. గాలి వీయటంలేదు. అల కదలటంలేదు. పక్షులేమైనయ్యో తెలియటమే లేదు.. ఆ మధ్యాహ్నపు ఎండ— భయంకరమైన ఎండ— ఎక్కడా ఏ ప్రాణినీ కదలాడనీయటంలేదు!

"...నేనే ఉద్దేశ్యంతో ఇక్కడకు వచ్చానో, ఇలా ఎందుకు సంభవించిందో నాకు అర్థమే కావటంలేదు.. అరుంధతి పేపర్లో ప్రచురించిన ప్రకటన నా జీవన రథానికి అడ్డపడింది. ..నా తెలియని ఆలోచనల నడుమ భయపడుతూ, భయపడుతూ ఈ గృహంలో కాలుపెట్టాను..' ఏదో అతీతమైన శక్తి అతడిని ఆవహించింది. అతడిని ఏదో మత్తులాంటి తెర చుట్టివేయగా అతడి నోటి నుండి మాటలు వెలువడసాగినయి. జరిగిన సంగతి విని అచేతనుడయ్యాను. అందమైన అరుంధతి మొఖాన కుంకుమ లేకపోవటం సహించలేకపోయాను. ఆ స్థితిలోనే ఒకనాడు ఆమె నామీద కురిపించిన ద్వేషాన్ని మర్చిపోయాను.. తిరిగి ఆమెను ప్రేమించసాగాను. ఆమెను నా గుండెల్లో, నా హృదయంలో పొదివి పెట్టుకున్నాను. పూజించాను.. కాని, ఈపూజకు ఈ బాంధవ్యానికి నీవు అడ్డు నిలబడ్డట్లనిపించింది. పరిస్థితులు బుజువు పరచసాగినయ్. నీ వంటే భయం కలిగింది. నీ మీద కోపం రగిలింది నీ మీద ద్వేషం నన్ను, నా నరనరాన్ని పట్టుకు పీడించసాగింది. ఏం చేయాలి? నేనుగాదు అరుణా!.. నా పరిస్థితులలో ఎవరున్నా ఇలాగే ప్రవర్తిస్తారు.. నిజం అరుణా నిజం.. నాలోనూ మానవత్వమున్నది— నీ వంటే జాలి వున్నది—కాని, ఆ పరిస్థితుల నడుమ నిన్ను ఇగిరించి వూహించుకున్నప్పుడు మాత్రం.." అతడు, ఆవేశంలో వూగిపోతున్నాడు.

అరుణ అతడి ఆవేశానికి కలవరపడ్డది.

"మీరు పడుకోండి..!" అన్నది. లేచి నిలబడి మొఖం పక్కకు తిప్పుకొని కన్నీళ్ళు తుడుచుకున్నది.

పక్కగదిలోకి త్వరత్వరగా వెళ్లబోతూ "పోనీ... నన్ను మీ నడుమ నుండి వెళ్ళిపొమ్మంటారా" అడిగింది.

తూలి పడబోయింది.

"నీ యిష్టం!"

* * *

"అరుణా!"

సమాధానం రాలేదు.

"అరుణా!"

ఆ గృహంలో ఉదయాన ఎనిమిది గంటల సమయంలో— సూర్యుడు అప్పటికే తన తీవ్రతలో పరిసరాలను ముడుచుకున్నప్పుడు— రాజశేఖరం నిద్ర లేచిన తరువాత—మొట్టమొదటిసారిగా అతడి కంఠం నుండి వెలువడిన మాటలు అవి!

"అరుణా!"

అరుణ పలకలేదు.

గోపన్న వచ్చాడు.

"అరుణ లేదా?.."

రాత్రి అరుణ మాటలతో వెలిగించిన అనుమానం కళ్లముందు నిజమయ్యేలా కనిపిస్తోంది!

ఆత్రతగా— తెలియని భయంతో- గోపన్న మొఖంలోకి చూచాడు.

"అరుణ లేదా?.. ఎక్కడకు వెళ్ళింది?"

"వస్తున్నారు బాబు.. కాఫీ పెడుతున్నారు!"

అతడికి తెలియకుండానే అతడు తేలిగ్గా శ్వాస పీల్చుకున్నాడు. తరువాత పది నిమిషాలకు అరుణ బయటకు వచ్చింది. ఆమెను చూస్తూనే ఆశ్చర్యపోయాడు.

తలారా స్నానం చేసి, జుట్టును వదులుగా జారవిడిచి చివర ముడి వేసుకొన్నది.. పెట్టెలో నుండి తీసి కట్టుకున్న ఇస్త్రీ పట్టుచీర ఆమె మొఖంలో తెలియని హుందాతనాన్ని పెంపొందించింది. నుదుట

పెట్టుకున్న కుంకుమ విశాలమైన ముఖంలో వింత కాంతులను వెదజల్లుతోంది.

ఆమె కళ్ళల్లోని కాంతి, పెదాల మీద చిరునవ్వు ఆ పరిసరాలలో చల్లని, తెల్లని వెన్నెలను కురిపిస్తోంది.

"నేను నిర్ణయానికి వచ్చేశాను!" అన్నది అరుణ.

అతడు మొఖం కడుక్కొని, మొఖాన్ని తుడుచుకుంటున్న వాడల్లా, చేతిలోని తువ్వాలను అలాగే పట్టుకొని, "ఏమని?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నేను ఇక్కడి నుండి వెళ్ళిపోదామనుకుంటున్నాను!"

అతడికి ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో అర్థం కాలేదు— మౌనాన్ని నెత్తిన రుద్దుకొని గుడ్లప్పగించి చూడసాగాడు.

పక్కనేదో నీడ కదిలి క్షణంలో మాయమయింది. ఇద్దరి గుండెల్లోనూ భయం గూడుకట్టుకుంటోంది. దీనికి పర్యవసానం ఏమిటి?

అరుణకూ—

ఏమి చేయాలో పాలుపోక పోయినప్పటికి ఆ గృహంలో ఇక తను ఉండటం— అందునా రాజశేఖరం అంత స్పష్టంగా చెప్పిన తరువాత—ఎవరికీ శ్రేయస్కరం కాదు అనిపించింది.

మరి అక్కయ్య ఎందుకని ఇంకా అలాంటి ఊహాల్లో వున్నది?

అతడి ప్రవర్తన ఆమెకు అవగతం కాలేదా?

లేక—?

తెలిసీ—ఆమె అంగీకరించ లేకపోతోందా?

ఆమె అంగీకరించని పక్షంలో—అతడు ఇంకా అలాంటి కోరికల కలల్లో ఎందుకుంటాడు?

ఏమో?..ఏమో?

..అదంతా తనకు తెలియని వల..అర్థం గాని చిక్కు ప్రశ్న...

"ఈ భారతదేశంలో నాకు వుండటానికి కావాల్సిన జానెడు చోటు ఎక్కడా దొరకకుంటుందా"

తిరిగి వాళ్ళ నడుమ గంభీరత అల్లుకుంటున్నది.

"అలా దొరకని పక్షంలో నేను జీవించి మాత్రం లాభమేం వున్నది"

"అరుణా!" అతడు ఆవేశపడ్డాడు. "నన్ను అర్థంచేసుకోలేవా ..నన్ను, నా మాటలను అర్థం చేసుకో అరుణా!..నా ప్రవర్తన అవమానంగా వున్నదా?.. ఆలోచించు అరుణా! జాలిగా ఆమె మొఖంలోకి చూశాడు.

"నాకు అర్థం గాకపోవటం ఏమిటి?" గంభీరంగా అన్నది. "మిమ్మల్ని పూర్తిగా అర్థం చేసుకోగలిగాను.. చేసుకున్నాను గూడా.. ఇది నేను హృదయపూర్వకంగా చెబుతున్న మాటలు!" ఆమె వక్షం ఉవ్వెత్తున లేచింది.

ఆమె కనురెప్పల చివర్లకు నీరు పొర్లింది.

ఆమె ఏదో చెప్పబోయింది.

అతడు అడ్డుపడదలుచుకోలేదు.

"చెప్పు!" కాస్త వంగి అన్నాడు.

"చిన్నతిపాటిగా.. ఉహూ.. మొట్టమొదటి సారిగా మీ వద్ద చనువు తీసుకొని నాలోని భావాల్ని, నా ఉద్దేశ్యాలని— మరొకరి, ముందుంచలేనివి- మీ ముందుంచుతున్నాను. నన్ను మీరు హృదయ పూర్వకంగా అర్థం చేసుకుంటారనే ఆశిస్తాను!"

ఆమె ఒక్కక్షణం ఆగింది.

అతడి ఆతృతతో గూడిన చూపులు ఆమె చెప్పబోతున్న మాటలకు ఒత్తాసు పలికినయ్.

ఆమె తిరిగి గొంతు విప్పింది.

"చాలా ఇరుకయిన పరిధి గీసుకొని ఆశలను కోరిక అను గగన కుసుమాలుగా భావించుకుంటూ జీవితాన్ని మా తల్లి దండ్రుల వద్ద గడిపాను. కాని, నన్ను ధనరూపేణానే గాకుండా, ఆత్మీయతతో గూడా బీదదాన్ని చేస్తూ భగవంతుడు నా తల్లిదండ్రులను నాకు దూరం చేశాడు.. నా జీవితం చీకటిలోను, భయంలోనూ చుట్టుకుపోయి వున్న క్షణాలలో— నాకు ఏం చేయాలో తెలియని పరిస్థితులతో—ఎలా జీవించాలో గూడా తెలియని పరిస్థితులలో—నెత్తిన ఎవరయితే ఈ కష్టాలను రుద్దారో—వారే అక్కయ్య రూపంలో నా ఎదుట నిలబడి— తిరిగి నాకు మంచి జీవితాన్ని ప్రసాదించారు.

దాన్తో నేను గడిచిన జీవితాన్ని, జీవితంలో చీకటిని మరిచిపోయి పెదాలకు నవ్వును రుద్దుకో ప్రయత్నించాను. కళ్ళకు వెలుగు పులుముకున్నాను. మొఖంలో ఆనందాన్ని చిందించుకున్నాను. నేను మరో ప్రపంచంలో కాలు పెట్టాను!

అటువంటి నాకు—నా కళ్ళముందు ఓ వ్యక్తి నుంచి —'ఈయనే నీ భగవంతుడు!' అని అక్కయ్య ఓ శుభదినాన చెప్పింది.

ఆనాడే ఆయన పాదాల వద్ద మోకరిల్లాను. ఆయనకు నా హృదయాన్ని అర్పించాను—కాదు, కాదు— నా సర్వాన్ని అర్పించాను. ప్రతిక్షణం ఆయన రూపాన్ని కళ్ళ ముందుంచుకొని, ఆయనతో నా భావి జీవితపు వెలుగును, ఆనందాన్ని చూసుకుంటూ గడిపాను. ఆయనే నా జీవితం అనుకున్నాను—"

ఆమె ఆవేశంతో ఒక్కక్షణమాగింది.

రాజశేఖరము ఆవేశంతో ఊగిపోసాగాడు.

"ఎవరా వ్యక్తి"

అరుణ అరక్షణం గూడా వ్యర్థం చేయకుండానే, "మీకు తెలుసుకోవాలనుందా అనుమానం... ఆయన మీరే!" అన్నది.

"అరుణా!"

"అవును..మీరే!.. అక్కయ్య నా హృదయంలో వెలిగించిన దేవుడు మీరే! — నా హృదయాన్ని, నన్ను అర్పించి—నా సర్వస్వం అయినది మీరే.. ఇక మరెవ్వరూ కాలేరు గూడా!"

"అరుణా!"

"మీరు ఆవేశపడవద్దు... నన్ను!" ఆమె తల విదిలించింది. "మీకు ఆవేశం కలిగించాలనేది నా ఉద్దేశ్యమే కాదు...." తల అటూయిటూ వూపింది. ఆమె కళ్ళు రెండూ కన్నీటి కుండలయినాయి.

"..భగవంతుడు తిరిగి చిన్నచూపు చూశాడు. పరిస్థితులు చాచి మొఖాన కొట్టినయ్. నన్ను, నా మనస్సుని, నా హృదయాన్ని నా సర్వస్వాన్ని నలిపివేసినయ్. నన్ను పిప్పి పిప్పి చేసినయ్.. ఉహూ!.ఇవన్నీ ఎందుకు ఇప్పుడు!" ఆమె ఏడుపు ఆపుకోలేకపోయింది ఎక్కువచ్చింది. "నా కలలు కరిగిపోయినాయి! నా మీద దురదృష్ట దేవత వల విసిరి బిగించి వేసింది...నేనేం చేయను?.. నేనేం చేయగలను?.."

ఆమె ఏడుపు ఆపుకోవటానికి ప్రయత్నించలేదు.

చటుక్కున రాజశేఖరం పాదాల వద్ద కూర్చున్నది.

ఆమె రెండు చేతులూ అతడి ఒక్కచాతి

నీగాడి వుంచి, కంట్లోని నీటిని, కను
రెప్పలు మూసి అయిష్టంగా చిమ్మి, "మీ పాదాల దగ్గర చోటు యివ్వమని అడిగే శక్తి నాకు లేదు.. నన్ను జీవితాంతం మీ గుండెల్లో పదిలి పెట్టుకొని ఉంచుకోమని అడిగే హక్కూ నాకు లేదు.. కాని నాదొక్కటే కోరిక— నా చివరి కోరిక— నా హృదయం తహతహతతో మీ ముందుంచుతున్న కోరిక— మీరు నన్ను కోపగించవద్దు.. అపార్థం చేసుకోవద్దు! అంతే.. సర్వం మరిచిపోండి... నేను చేసిన తప్పులన్నీ క్షమించండి.. నన్ను ఈ భారతదేశంలోని ఒక అభాగ్య స్త్రీగా మాత్రం గుర్తుంచుకోండి... అదే నాకు శాంతి. అదే నా జీవితాశ!..' అన్నది. తల ఒరిగిపోతుండగా, ఈరోజే వెళ్ళిపోతున్నాను. మరెన్నడూ మన జీవితంలో కనబడనంత దూరం వెళ్ళిపోతున్నాను... కాని, ఎక్కడున్నా నా హృదయం మీ వద్దే వుంటుంది., జీవితాంతం, మొట్టమొదటి సారిగా. నా అంతట నేనుగా నన్ను అర్పణ చేసుకున్న మీ మీదే...నా..." ఆమె నోట మాట పెగల్లేదు.

కళ్ళు తిరిగిపోయినయ్..

రాజశేఖరం ఆవేశంతో ఆమె రెండు బుజాలు పట్టుకొని ఆమె మొఖంలోకి చూస్తూ ముందుకు వంగబోయాడు.

ఎవరో నెట్టేసట్లుగా తలుపు తెరుచుకున్నది.

ఇద్దరూ ఉలిక్కిపడి తలెత్తి వాకిలి వైపుకు చూశారు.

అరుంధతి!

ఆమె వారిద్దరూ కూర్చొని వున్న దృశ్యం చూస్తూనే చటుక్కున మొఖం పక్కకు తిప్పుకున్నది— ఆమె కళ్ళు ఆనందంతో నవ్వినయ్!

* * *

"అయితే అరుంధతీ! నీ మనస్సు మార్చుకోలేనన్న మాట.. నా మాటకు విలువ యివ్వలేనన్న మాట.. ఇకసరే! నేనెందుకిక్కడ?.. నేను వెళ్ళిపోతాను!"

"ఆవేశ పడబోకు బావా!.. ఆలోచించు... సావధానంగా ఆలోచించు.. మనస్ఫూర్తిగా ఆలోచించు బావా!" అరుంధతి అన్నది— తలెత్తకుండానే.

ఆమె వూరినుండీ— ఇక్కడ అర్థంగాని పరిస్థితులను చూస్తున్న అర్థహీనంగా వ్రాసినప్పుడు— అనుకోకుండా ప్రయాణమయి

# అరుణోదయం

వచ్చింది.

ఆమె వచ్చినవాడు—రాత్రి భోజనాలయిన తరువాత అసలు విషయం అనుకున్నట్లుగానే ప్రసంగంలోకి వచ్చింది.

రాజశేఖరం—ఆమె మనస్సు మార్చుకోకపోవటంతో —కోపంతో గంయ్యిన లేచాడు.

అరుంధతి అనునయిస్తోంది.

అరుణ ఏమీ చేయటానికీ పాలుపోని పరిస్థితులతో గుండెను చిక్కపట్టుకొని భగవంతుని ప్రార్థిస్తూ— వారిద్దరినడుమ ప్రేక్షకురాలిగా నిలబడిపోయింది.

ఉండి ఉండి— రాజశేఖరం కోరచూపులు ఆమె మీద ప్రసరిస్తున్నయి.

"...ఈలాంటి పరిస్థితులు ఏర్పడతయ్యని నేను కలలో గూడా అనుకోలేదు. జరిగిందేదో జరిగిపోయింది.. ఇక నేను నిన్ను వివాహం , చేసుకుంటాను అనేది కల్లోమాట.. అది ఎన్నడూ జరగని పని. దానిని గురించి నీవు ఏమాత్రమూ ఆలోచించాల్సిన అవసరం లేదు.."

"ఆలాంటప్పుడు.. నా మాట వినలేని నీవు.. నీ మాట మాత్రం నేను వినాలని ఎలా అనుకుంటావ్?" ఆమె మాటన్న, మధ్యలోనే త్రుంచివేస్తూ కోపంగా అన్నాడు. "నేను తెల్లవారుతూనే వెళ్ళిపోతున్నాను. ఇక ఒక్కక్షణం ఇక్కడ వుండలేను.. ఉండవల్సిన అవసరం లేదు!"

"సరే నీ యిష్టం!" అరుంధతి విసురుగా లేచి నిలబడింది. "ఎవరు ఎవరికి చెప్పగలరు?.. 'ఏది భావ్యమో, ఏది కాదో' గూడా గ్రహించలేని స్థితిలో వున్నప్పుడు నేను తాపత్రయ పడీ ప్రయోజనమేవున్నది?" అంటూనే గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళబోయింది. "ఇంత వయస్సు వచ్చిన తరువాత—జ్ఞానహీనులవుతున్న వాళ్ళని ఒక్క ఆ పైన వున్న భగవంతుడే రక్షించగలడు!"

ఆమె అన్న చివరిమాటలు అవి!

రాజశేఖరం మాట్లాడలేదు.

అరుణకు మాట పెగల్లేదు.

* * *

తెల్లవారింది.

అప్పుడే జనం మేల్కొన్నా రన్నట్లుగా బిందెల చప్పుళ్ళు, పాలవాళ్ళ కేకలు వినబడుతున్నయి.

అరుణ లేచింది.

పక్కమంచం మీద అరుంధతి కనబడకపోవటంతో, తనకు ఆలస్యంగా మెళకువ వచ్చినందుకు పశ్చాత్తాప పడుతూ మంచం మీద నుండి లేచి ఇవతల గదిలోకి వచ్చింది.

రాత్రి ఆమెకు నిద్రలేదు అరుంధతి అనుకోని రాక— ఆమెను మరింత ఆయోమయంలో పడవేసింది ఒకవిధంగా సంతోషించింది! ఏది ఏమైనా—రాత్రి ఆమెకు నిద్రలేదు!

ఎక్కడా అరుంధతి అగపడలేదు.

వంటయింటి వైపుకు వెళ్ళింది

ఆ తలుపు తెరవనయినా లేదు

రాజశేఖరం గదిలో వున్నదేమోనని అక్కడకు వచ్చింది.

అక్కడా లేదు.

అప్పటికే రాజశేఖరం ఏదో కాగితం చదువుతూ కూర్చొని వున్నాడు

అది అరుంధతి వ్రాసింది

అందులో ఇలా వున్నది

"బావా!

కోరికలు గుర్రాలయితే మానవుల చేతిలో కళ్ళాలు లేకపోవటం మహా విపత్తు సుమా! అందుకు నీవే నిదర్శనం ఒకనాటి నేను గూడా అనుకో!

నిన్ను నేను నిందించటంలేదు బావా! నా ఖర్మకు విచారిస్తున్నాను అరుణ దురదృష్టానికి జాలి చెందుతున్నాను . నీ మూర్ఖత్వానికి సిగ్గుపడుతున్నాను.

ఏది ఏమైనాగాని— నా నిర్ణయం ఇదే— నేను ఈ రోజున మీ నుండి— ముఖ్యంగా నీ నుండి— ఏదో తెలియని ప్రదేశంలోకి వెళ్ళిపోతున్నాను.. బహుశః అది తిరిగిరాలేని ప్రదేశమేమో గూడా!

అది నిజం! అరుణ నీది దానిని కాదనగలశక్తి నీకేగాదు.. ఆ భగవంతుడికి గూడా లేదేమోననిపిస్తోంది నాకు!

అంతేగాదు—నీవు ఈ విషయంలో పరాజితుడువవుతావనేది నిస్సందేహం — నా కోరిక గూడా!

నేను తిరిగి ఈ గృహంలో కాలు పెట్టటమనేది నీ కోరికయినట్లయితే— అది నీవు అరుణను వివాహం చేసుకున్న నాడే జరుగుతోంది! తప్పదు బావా తనని తానుగా అర్పించుకున్న స్త్రీకి అన్యాయం జరగటం మరొక స్త్రీ సహించలేదు. అరుణ—నీవు లేని అరుణ జీవించలేదనేది

నేను తెలుసుకున్న నగ్నసత్యం— అది నీకు తెలిసి వుండవచ్చునుగాని నిన్ను విషపు పొరలు క్రమ్మివేసినయ్.

సరే! ఇక— నే నెక్కడ వుండేది తెలుసుకోవట మంత కష్టం మరోటి నీకుండదు. నీవు అరుణను వివాహం చేసుకున్న మరుక్షణంలోనే అదుర్భేధ్యమైన రహస్యం పటాపంచలవుతుందనేది నిస్సందేహమే!

అసలు— దీనికంతటికీ కారణం—నేను, —హృదయంలేని నేను— నీ జీవితం ఇలా అన్యాయానికి కారణం నేను— రాక్షసినైన నేను— ఈనాడు పశ్చాత్తాపంతో కృంగి కృశించిపోతేనేం, నీ విషాద జాలి కురిపిస్తేనేం —ఆనాడు కావాలని, నిన్ను దూరం చేసుకోవాలని—నిన్ను కుంటివాడిని చేసి (ఇప్పటి వరకు నీ కుంటికాలికి కారణం నేనని నీకు లీలగానైనా వూహ వచ్చి వుండకపోవచ్చు—నీ హృదయం నాకు తెలుసు బావా!) ఉహూ.. దేవుడు సరియైన శిక్షే నాకు విధించాడు బావా— దానిని ఎవరూ తప్పించలేరు..

కాదనకు బావా— నాయీ కోరికను జాలితో నలిపి వేయకు బావా — ఏమీ తెలియని అమాయిక అరుణను నీ మొండి పట్టుదలకు బలి యివ్వబోకు బావా —

అలా అంటూ జరిగితే— నేను సహించలేను, నేను భరించలేను, నేను జీవించలేను.

—అరుంధతి ''

రాజశేఖరం చేతిలోని కాగితం పూర్తిగా చదివి అయోమయంగా తల ఎత్తటంతోనే అరుణ అడిగింది· ''అక్కయ్య పెద్దన్నే ఎక్కడకు వెళ్ళింది''

''వెళ్ళిపోయింది!''

''ఎక్కడికి''

''ఎవో!''

''అంటే —''

ఏదో పగిలినట్లనిపించింది — కళ్ళ ముందు ఏదో భయంకరమైన వస్తువు పగిలి వెలుతురు విరజిమ్మినట్లనిపించింది — ఆమెకు అర్థమయింది!

ప్రపంచమే గిర్రున తిరుగుతున్నట్లనిపించగా భయంతో, బాధతో బిగుసుకుపోయింది.

వెలుగు కను మరుగయింది. చీకటి వ్యాప్తమయి నట్లనిపించింది. చిన్నగా ఆకాశం గిర్రున తిరుగుతూ, నల్లబడి పోతూ, ఆకారాన్ని కోల్పోతూ—నల్లని ముద్దలా మారిపోయింది.

అరుణ కుప్పగా కూలిపోయింది.

రాజశేఖరం సర్వం మరచి దిక్కులు తోచక చూస్తున్న రాజశేఖరం — ప్రాతకు తలఎత్తాడు.

అరుణ—క్రిందపడి, గిలగిలలాడుతూ, కాళ్ళూ చేతులూ కొయ్యలా బిగుసుకుపోగా—విరుచుకుంటుంది.

నోటిలో నుండి తెల్లని నురుగు, భయంకరంగా ఎదుటి మనిషిని నలిపివేస్తూ, కలిచివేస్తూ—స్మృతిహీన అయిన అరుణకు మరింత భయానక రూపాన్ని కలిగిస్తూ వెలువడుతుంది.

రాజశేఖరానికి ఏం చేయాలో తోచ లేదు. అయోమయమయింది.

వణికిపోయాడు.

అరుంధతి!

—అరు

ఎవరు .. ఎవరు .. ఎవరు

ఉహూ....

కొన్నిక్షణాలు కొన్ని యుగాలయినయి.

లేచి నిలబడ్డాడు. శరీరమంతా చల్లబడుతోంది. కళ్ళ ముందు పరిసరాలు మసకమసకగా కనబడుతున్నాయి. భూమే గిరగిరా తిరుగుతున్నట్లనిపించింది.

చేతిలోని కాగితాన్ని ఉండ చుట్టి దూరంగా విసిరి వేశాడు.

చేతిక్రిందకు కర్రను జేర్చుకొని వంటయింట్లోకి పరుగెత్తాడు.

గ్లాసుతో నీళ్ళు తీసుకువచ్చాడు.

అరుణ తల దగ్గరగ కూర్చున్నాడు.

చిన్నగా మొఖాన నీళ్ళు చల్లసాగాడు.

ఆమె రూపం—రేగిన జుట్టుతో, పాలిపోయిన చెక్కిళ్ళతో, విరిగిన పెదాలతో—జాలిగొలిపే ఆమె రూపాన్ని—మసకమసకగా కనబడుతున్న ఆమె మొఖాన్ని కన్నార్పకుండా చూస్తూ కూర్చుండిపోయాడు.

అతడిలో ప్రళయం రేగింది. తుపాను గాలులు ప్రారంభమయినయి— తిరిగి మరుక్షణంలోనే చప్పబడిపోయింది. నీరు కారిపోయాడు.

ఏం చేయాలో తోచని పరిస్థితి!

తరువాత కొన్నిక్షణాలకు— శూన్యాలోకి చూస్తూ కూర్చున్న అతడు కదిలాడు ఆమె తలను తన ఒళ్ళోకి జేర్చుకున్నాడు.

వంగి ఆమె మొఖంలోకి చూస్తూ నీళ్ళు చల్లుతున్న అతడి మొఖంలో వింత మార్పు వచ్చింది. కళ్ళు కాంతితో వెలగసాగినయి. చేతులు దృఢంగా పని చేయసాగినయి. మనిషిని నీరసం వీడిపోయింది.

ఇక ఈలాంటి పరిస్థితి నీ కెన్నడూ ఏర్పడదు అరుణా! అన్నంత జాలిగా వున్నాయి అతడి చేష్టలు.

అతడికి అప్పుడే తెల్లవారినట్లని పించింది!

(అయిపోయింది) ●



# ఝాన్సీ లక్ష్మీబాయి

(వర్సాయ్‌కర్ ఒక బ్రాహ్మణ పండితుడు. అతనిది బొంబాయికి చేరువలో వున్న ఒక కుగ్రామం. 1856 లో ఉత్తర హిందూస్థాన యాత్రకు వెళ్తూ ఝాన్సీలో ఆగాడు.)

''పవిత్రమైన పుణ్యక్షేత్రాల్ని దర్శించాలనే కాంక్షతో నా గ్రామాన్ని విడిచిపెట్టాను. ఝాన్సీరాణి యిప్పుడు యజ్ఞం చేస్తూ వుంది. ఈ సమయంలో ఇక్కడకు రావడం నా అదృష్టం. ఒకవైపు ఈస్టిండియా కంపెనీని ఎదుర్కొంటూ మరోవైపు యజ్ఞాన్ని ఘనంగా నిర్వహిస్తోంది రాణి. ఎంతోమంది పండితుల్ని రావించి సత్కరిస్తూ వుంది!''—వర్సాయ్‌కర్.

(ఈ మహారాష్ట్ర పండితుడైన వర్సాయ్‌కర్ ఆ మహాయజ్ఞంలో చక్కని బాధ్యత తీసుకున్నాడు. అతని పాండిత్యానికి, ప్రతిభకు రాణి ఎంతగానో ఆశ్చర్యపడింది. ప్రత్యేకమైన బహుమతుల్ని ఇచ్చి సత్కరించింది. యజ్ఞం పూర్తవగానే వర్సాయ్‌కర్ తన యాత్రలో నిమగ్నమయాడు.)

''ఓ మహారాష్ట్ర యాత్రికుడా! సిపాయిలున్నారు జాగ్రత్తగా ఉండు. కార్చిచ్చు కలకత్తాకు కూడా ప్రాకింది. బ్రిటిష్ సైనికులు తిరుగుబాటుదార్లుగా అనుమానించి అమాయకులైన యాత్రికుల్ని కూడా క్రూరంగా హింసిస్తున్నారు''—ఒక సహచరుడు )

(అంతే. వర్సాయ్‌కర్ తన యాత్రను విరమించుకుని బొంబాయికి తిరిగి వస్తూ గ్వాలియర్ వరకు వచ్చాడు. ఆ నగరానికి ఎంతో బలమైన కోట గోడలున్నాయి. అది సిపాయిల వశమైపోకుండా యోధులు పోరాడుతున్నారు.)

''ఓ భగవంతుడా! ఇంత ఘోరాన్ని కళ్లారా చూస్తూ సహించగలిగే ఓర్పు నాకెందుకిచ్చావు? ఇంగ్లీషు సైనికులు దేశమంతా కొల్లగొడుతున్నారు. ప్రజల్ని చిత్రహింసలకు గురి చేస్తున్నారు. బాధిస్తున్నారు. నేనీ కీకారణ్యంలోని దేవాలయం ఘట్టులో ఉన్నాను. అయినా నా ప్రాణం సురక్షితం కాదు. అదిగో, గుర్రపు డెక్కల చప్పుడు వినిపిస్తూ వుంది. ఎవరో ఇటే వస్తున్నారు. బ్రతికాను. ఆ స్వారీ చేస్తూ వస్తున్నవాడు ఆంగ్ల సైనికుడు కాదు. మగవాడు కూడాకాదు ఒక భారత వనిత. కవచం ధరించింది. మొలలో కత్తి. ఇదేమీ కలకాదు గదా! ఆమె లక్ష్మీబాయ్ అయి వుంటుంది! అవును ప్రొద్దుట్నుంచీ ఆంగ్లేయ సైనికులు ఇటుగా పరుగులెత్తడం చూస్తూనే వున్నాను. బహుశా రాణి యుద్ధరంగం నుంచే వస్తున్నట్టుంది! ఎంతటి కష్టకాలం! సహవారం, పల్లకీలో పర్యటించవలసిన రాణి, ఒంటరిగా, ధూళితో రక్తపుమరకలతో నిండిన చిరిగిపోయిన దుస్తులతో, ముఖం పీక్కుపోయి స్వారీ చేస్తోంది!''

''బాబూ..., నాకు చాలా దాహంగా వుంది. మీ పాత్రను తాడును ఒకసారి అనుగ్రహించినట్టయితే నీళ్ళు తోడుకుని దహం తీర్చుకుంటాను''—ఝాన్సీరాణి.

(వర్సాయ్‌కర్ కళ్లలో నీళ్ళు నిండాయి. చింతాక్రాంతుడయివాడు. ఒక మహారాణి తన్ను ప్రాధేయపడడం అతనికి సిగ్గుగా వుంది. దుప్పటి తీసి క్రిందపరచి కూర్చోమన్నాడు. నీళ్ళు తోడిస్తాను త్రాగమని ప్రార్థించాడు. కాని రాణి అందుకు సమ్మతించలేదు.)

''తల్లీ, లక్ష్మీబాయ్..! మీకు దాహం తీర్చేందుకు నీళ్ళు కాని, కూర్చోడానికి ఆసనంకాని ఇవ్వడానికి నోచుకోలేని నా అభాగ్యాన్ని ఏమని నిందించుకోను? తల్లీ, నన్ను గుర్తించలేదా? మీ దగ్గర నుంచి అపరిమితమైన బహుమతుల్ని అందుకున్న బ్రాహ్మణుణ్ని నేను. మీ చేతులతోనే కదా ఝాన్సీరాజ ప్రసాదంలో యజ్ఞ సందర్భంగా ప్రసాదించరు''—వర్సాయ్‌కర్.

(రాణి సింహాసనాన్ని పోగొట్టుకున్నది. కోటను అందులోని ధనరాశిని పోగొట్టుకున్నది. సైన్యాన్ని పోగొట్టుకున్నది. ఆమె కుడిభుజంగా నిలిచిన వీరులందరూ ఒక్కరొక్కరుగా హతమయి పోయారు. జయం మీద నమ్మకాన్ని కూడా పోగొట్టుకున్నది. సర్వమూ ఆమెను విడిచిపెట్టాయి. ఒంటరిగా మిగిలిపోయింది! అయినా ఆమె హృదయంలోని ఔదార్యాన్ని ఉత్తమాదర్శాన్ని మాత్రం విడచిపెట్టలేదు!

''మహాత్మా! నేను మిమ్మల్ని గుర్తుపట్టక పోవడమేమిటి? మిమ్మల్ని గుర్తించిన కారణంగానే మీ ఆతిథ్యాన్ని స్వీకరించలేకపోతున్నాను. ఒక వేదశాస్త్ర పారంగతుడి నుంచి నేను గ్రహీతను కావాలా? కాలేను. యజ్ఞకాలంలో మిమ్మల్ని నేను సత్కరించిన మాట నిజమే కావచ్చు. దానికి మీ నుంచి నేను ప్రతిఫలం పొందలేను. వేదపండితులు నాకు ధర్మాన్ని బోధించవలసిన వారే కాని, నా కోసం కాయకష్టం చేయవలసిన వారు కారు!''—ఝాన్సీ లక్ష్మీబాయి.

''దేవుడి దయవల్ల యింటికి క్షేమంగా చేరుకున్నాను. ఇప్పుడు నా ఉత్తరదేశ యాత్రను క్లుప్తంగా రచింపదలుచుకున్నాను. ఝాన్సీరాణి నా సేవను అంగీకరించని సంఘటన రాస్తున్నప్పుడు ఆ దృశ్యం నా కళ్లలో మెదిలి ఇప్పటికీ కన్నీరు పెట్టిస్తున్నది!''

(వర్సాయ్‌కర్ 1860 లో రాసిన గ్రంథం 1910 లో ప్రచురితమయింది. ఆ గ్రంథంలో అత్యుత్తమమైన భాగం వర్సాయ్‌కర్ నిర్మించిన ఝాన్సీ లక్ష్మీబాయి వ్యక్తిత్వం.

—వి. సు.

మొదట అలా ముందుకు పడుతున్నట్లు అనిపిస్తుంది - తర్వాత అలవాటు పడిపోతారు!



'నా
చర్మసౌందర్యం
కోసం లక్స్
నాకు ప్రీతి'
అన్నది **జమున**

జమున కున్నట్లే మీకున్న చర్మ సౌందర్యం అమూల్యం..........
ఆ సాధనయే దానికి తగినది.

'వనిత సొగసుకు నిష్కళంకమైన చర్మ సౌందర్యం మరి దేనికంటెను ఎక్కువ గుణకారి. నా చర్మసౌందర్య సాధనగా సర్వదా లక్స్ వాడతాను. దాని మీగడవంటి నురగ, దాని దివ్యమైన పరిమళం నాకెంతో ఆనందకరం. అలాగే మీకున్నూ అని నా నమ్మకం.' అన్నది అతి సుందరియగు జమున. లక్స్‌తో అతి మనోహరముగా కనబడండి.




తెలుపులోను నాలుగు వానవెల్లి రంగుల్లోను వున్నది.

**లక్స్ టాయ్‌లెట్ సబ్బు**

సినిమా తారలకు సౌందర్యమునిచ్చే
శుద్ధమైన సౌమ్యమగు సబ్బు

లింటాస్ ఎల్.టి.ఎస్. 200-140 TL          హిందుస్థాన్ లీవర్ తయారీ

# వారఫలం

**21-4-1967 శుక్రవారం మొదలు**
**27-4-1967 గురువారం వరకు.**

**మేషం**: వృత్తివ్యాపారాల్లో ఆదాయంకంటే ఖర్చు అధికంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారాంతంలో అనుకోని చికాకులకు గురికాగలరు.

స్త్రీలకు— మీ కుటుంబవ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**వృషభం**: మీకుమున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసివస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలసంచలనం పెరుగుతుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిథునం**: సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతన అవకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు కొంచెంశ్రమ మీద ఫలించగలవు. ఉద్యోగంలో అనుకూలవర్తమాలను వింటారు. సాంఘిక వ్యవహారలకు అనుకోని మార్పులు వస్తాయి.

స్త్రీలకు— కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం**: వ్యాపార విస్తరణ ప్రయత్నాలు, ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభించగలదు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం**: వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య**: వృత్తివ్యాపారాల్లో ఇదివరకు యేర్పడిన చిరాకులు తొలగిపోతాయి. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. కోర్టువ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు.

స్త్రీలకు— కుటుంబకార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల**: ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వారం ప్రారంభంలో వృత్తివ్యాపారల్లో చికాకులు యేర్పడతాయి. మీ విలువైన వస్తువులు పోయే ప్రమాదం ఉంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు వారాంతంలో బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం**: వృత్తివ్యాపారాల్లో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో శ్రమకు గురికాగలరు. దూరప్రయాణాలు వాయిదా వేయుడం మంచిది. విద్యావైజ్ఞానిక రంగాల్లో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు**: ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల మున్ముందు కూడా తగిన ఉపయోగం ఉంటుంది. వ్యాపారంలో నూతనావకాశములు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలుకూడా లాభించగలవు. వారాంతంలో అనుకోని చికాకులకు గురికాగలరు. మిత్రులసహాయం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మకరం**: వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. వ్యాపారంలో అనుకూలవర్తమాలను వింటారు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బుచేతికి వస్తుంది. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కుంభం**: వారంప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో ఆందోళనకలిగించే పరిస్థితి యేర్పడుతుంది. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసంచేస్తారు. వారం మధ్యలో అనుకూలపరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబవ్యవహారాలవల్ల కార్యభారం పెరుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం**: ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు తగవు. వారంమధ్యలో సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

—మహేష్



'గృహలక్ష్మి'లో పద్మశ్రీ భానుమతి, నాగేశ్వరరావు.

చిత్రసమీక్షలు :

# గృహలక్ష్మి

ఆలు మగల మధ్య, అందులో కొత్తగా పెళ్ళి అయిన వారి మధ్య ఏవేవో కారణాలు చూపించి అడ్డుగోడలు పెట్టటం ఎలాంటి విపరీత పరిణామాలకు దారి తీస్తుందో అలాంటి సందర్భాలలో ఆ యువతీయువకుల మనః ప్రవృత్తులు ఎలా ఉంటాయో విశదం చేస్తూ వినోదాత్మకంగా, హాస్యరస భరితంగా రూపొందించిన చిత్రం భరణీపిక్చర్స్‌వారి గృహలక్ష్మి

ఈ చిత్రంలో చిట్టిబాబు ఉరఫ్, శ్రీధరరావుగా అక్కినేని నాగేశ్వరరావు, లక్ష్మిగా పద్మశ్రీ భానుమతి నూతన పంథాలో ప్రతిభావంతమైన నటనను ప్రదర్శించారు. ఫాయర్ భగవంతంగా ఎస్. వి రంగారావు గణనీయమైన నటనను ప్రదర్శించారు. పద్మనాభం నటన అడుగడుగునా ప్రేక్షకులకు గిలిగింతలు పెడుతుంది. అల్లు రామలింగయ్య, రమణారెడ్డి, రాజ్‌బాబు, చలపతిరావు అందించిన హాస్యం చక్కగా వుంది. చిత్రంలోని మిగతా నటీనటులందరూ పాత్రోచితంగా నటించారు.

ఎస్. రాజేశ్వరరావు సంగీతం, పి. నాగేశ్వరరావు ఛాయాగ్రహణం పేర్కొనదగినవిగా, కన్నుల పండువగా ఉన్నాయి.

చిత్రంలోని పాటలన్నీ విన సొంపుగా మనోహరమైన బాణీలతో కూర్చబడ్డాయి. దర్శకత్వం ప్రతిభావంతంగా వుంది. హాస్యరసభరితమైన, చక్కని వినోదాన్ని అందించే ఈ చిత్రానికి దర్శక నిర్మాత పి. రామకృష్ణ, సంగీతం ఎస్. రాజేశ్వరరావు, కెమేరా పి. నాగేశ్వరరావు. ఈ చిత్రం నవయుగ వారి ద్వారా ఆంధ్రలో విడుదలయింది.

—మాధవ్ ●

చిత్రసేన మహారాజు ఏకైక కుమారుడు చంద్రసేనుడు, హిరణ్యవర్మ మహారాజా గారాబు పుత్రిక భువనసుందరి, బ్రహ్మ శాపానుసారం ప్రేమించుకోక తప్పలేదు. కాని హిరణ్యవర్మ ఆస్థానంలో వున్న రాజగురువు వూరుకుంటాడా? కొడుకు దేవదత్తుడిని రాజును చేసి ఆ రాకుమార్తెను కూడా లభింకే ఇవ్వాలని నానా తంటాలు పడ్డాడు. 'కుట్రలు, ఎదురుకుట్రలు' అన్నీ సాగాయి. ఈ కథలో ఎగిరే పల్లకి, బ్రహ్మరాక్షసి, పరకాయ ప్రవేశం వగైరా సినీ ట్రిక్కులన్నీ కాస్త చోటు చేసుకున్నాయి. అంతిమ విజయం కథానాయకునికే లభించి హీరో గారిట్టే దానిని ఎలాగూ ఎవరూ ఆపలేరు. ఆవిధంగా అతడు భువనసుందరిని, రెండు రాజ్యాలను, తన అధీనం చేసుకున్నాడు.

కథ మామూలే. సంగీతంలో అంత రుచి లేకపోయినా 'వయసు రమ్మంది' — 'హృదయమునిండి' అనే పాటలు హాయిగా వున్నాయి. ఒక పద్యం కూడా చాలాబాగుంది. బ్రహ్మరాక్షసితో ఎన్. టి. రామారావు, పోరాటం, ఆకాశమార్గాన ఎగిరే పల్లకిపై — వేరే ఎక్కడా చోటులేక— హీరో విలన్ల కుస్తీ పట్లు, సామాన్యజనానికి పిల్లలకు ఆసక్తి కలిగించవచ్చు. కథ అంతా పట్టదు. ప్రేక్షకులు కాస్త ఓపికపట్టాలి. డైలాగ్సు సాధారణం.

చిత్రసమీక్ష :

# భువనసుందరి కథ

జానపద చిత్రాల విజయం ప్రధానంగా ట్రిక్కులు, తళుకుబెళుకుల పైననే ఆధారపడి వుంటున్నది. కథలో ఎవరూ ఏ విధంగానూ క్రొత్తదనం చూపడం లేదు గనుక ఆ విషయమై ఆశించడం కూడా పొరపాటే. జనానికి కావలసిన వ్యాపార లక్షణా లన్నీ వున్నా అనేక జానపదచిత్రాలు దెబ్బ తింటున్నాయి. అయినా ఇది ఒక లాటరీగా భావిస్తూ ఎవరి ప్రయత్నం వారు చేయకొంటూనే వున్నారు.

శ్రీదేవి ప్రొడక్షన్సువారు కూడా ఇలాగే 'భువనసుందరి కథ'తో ఒక ప్రయత్నం చేశారు. ఆంధ్రలో ఏప్రిల్ 7న విడుదలయింది దీనిని మద్రాసు ప్రీవ్యూ ప్యారడైజ్‌లో 3వ తేదీన పత్రికలకు చూపారు.

చంద్రసేనుడుగా ఎన్. టి. రామారావు మిగతా జానపదాలలో వలెనే సమర్థతతో తన పాత్రను నిర్వహించారు. భువనసుందరిగా కృష్ణకుమారి ప్రతిభ కనుబరచింది. రాజగురువుగా ధూళిపాళ అత్యంత ప్రశంసనీయంగా ఆ పాత్రకు గల కనుపించని దుష్టత్వాన్ని చూపెట్టారు. జయశ్రీ నృత్యాలు బాగున్నాయి. దేవదత్తుడుగా సత్యనారాయణ ఈ చిత్రంతో 'అండర్ గ్రౌండ్'లో కెళ్ళాడు. ఆ అవస్థను చక్కగా ప్రదర్శించాడు. అల్లు రామలింగయ్య రాజభక్తిని సముచితంగా చూపాడు. ముక్కామల, మిక్కిలినేని, జూనియరు భానుమతి ప్రభృతులు నటించారు.

—కె. ఎం. ●

దిన దినానికీ...

# రెక్సోనావల్ల మీ చర్మ సౌందర్యం అతి మనోహరంగా పెంపొందుతుంది

రెక్సోనా వాడుటవల్ల మీ చర్మ సౌందర్యం ప్రతిరోజూ కొత్త సొంపుగా వుంటుంది. రెక్సోనాలో నే సౌందర్యకారియైన ప్రత్యేక మూలిక మిశ్రమం 'కేడిల్' వున్నది. రెక్సోనాయే మీకెంతో ప్రీతిమైన మనోల్లాసకరమగు శరీరమును మీ శరీరంపై విరిసియుంచుతుంది. రోజూ రెక్సోనా వాడండి




హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

'కేడిల్' తో గూడిన రెక్సోనా
మీ చర్మానికి గుణకారి

# నటి ఎల్. విజయలక్ష్మి వివాహం

ప్రఖ్యాత నాట్యతారగా పేరుపొందిన కుమారి ఎల్. విజయలక్ష్మి వివాహం ఈ నెల 20 వ తేదీన కలకత్తాలో జరుగనున్నది. బెంగాలీ యువకుడైన డాక్టర్ సుర్‌జిత్ దత్తాని ఆమె వివాహమాడబోతున్నది. శ్రీ సుర్‌జిత్ దత్తా ఫిలిప్పైన్స్‌లోని మనిలాలో ఉన్న ఇంటర్‌నేషనల్ రైస్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో స్టాఫ్ ఆఫీసర్‌గా ఉన్నారు. ఈయన వయస్సు 28 సంవత్సరాలు.



ఎల్. విజయలక్ష్మి

వివాహానంతరం నటి విజయలక్ష్మి తాను ప్రస్తుతం ఒప్పుకున్న కాంట్రాక్టులను పూర్తి చేయడానికి, 67 జూలై వరకూ భారతదేశంలోనే ఉంటుంది. ఆ తర్వాత ఆమె సినిమాల్లో నటించదు. నటి విజయలక్ష్మి వివాహం ఆమె తల్లిదండ్రులే నిశ్చయించారు. ఈనెల 24 వ తేదీన మద్రాసులోని న్యూ ఉడ్‌లాండ్స్‌లో రిసెప్షన్ ఉంటుంది. ప్రస్తుతం ఈమె ఎస్. వి.ఎస్. వారి చిత్రంలోనూ, సురేష్ కంబైన్స్ వారి చిత్రంలోనూ, శేఖర్ ఫిలింస్ వారి గొల్లభామలోనూ, తదితరమైన తమిళ చిత్రాలలో నటిస్తున్నది.

—మాధవ్



'భువనసుందరికథ'లో ఎన్. టి. రామారావు, కృష్ణకుమారి



'చదరంగం'లో హరనాథ్, జమున

[illegible] హాస్యం దేహి !

పి యల్ ప్రసాద్, పొన్నూరు

**అయ్యొయ్యో ఎంతమాట! కాస్త ఆగండి. "శ్రీ శ్రీ శ్రీ మర్యాద రామన్న"గా వచ్చి మిమ్మల్ని నవ్విస్తాను.**

మన ప్రభుత్వం తెలుగు సినిమాలలో హాస్యం నిషేధిస్తే మీరేం చేస్తారు?

భాస్కర భ్రమరాంబ, తిరుపతి

**నేను రేలంగి, రమణారెడ్డి, బాలకృష్ణ, రాజబాబు, కలసి నిరాహార దీక్ష మీచేత చేయిస్తాం.**

ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా మీరు ప్రధాన మంత్రి అవాలని అంటాము మీరేమంటారు?

కె ప్రహ్లాద్, హైదరాబాద్

**యిప్పుడు నవ్వేజనం నావరిపాలనలో ఏడుస్తారంటాను.**

ఆత్మ చావదంటారు కదా! మరి, ఆత్మను ధరించిన మానవుని గమ్యస్థాన మేది?

టి రవీంద్రనాథ్ దాస్, హైదరాబాద్

**ఈ అనంతమైన ప్రకృతి**

కాంగ్రెసు నాయకీవణులు గాంధీ టోపీ ధరించరేం?

పర్వ భాస్కరరావు, నల్లగొండ

**కస్తూరి బాయి ధరించలేదు కాబట్టి**

తమ్ముడూ! ఈ మధ్యవస్తున్న తెలుగు సినిమాలలో ఆడవాళ్లకు మగవాళ్లు వేసుకునే బట్టలు—బాగా బిగుతుగా వుండేవి వేస్తున్నారు, ఎందుకు?

టి కాంతం, కాకినాడ



**లింగసౌష్టవము - విశిష్టంగా కనబడేదానికి, యిది లేకపోతే ధనప్రాప్తి సున్న.**




మీరు మగవారయి ఉండీ, విరోధిషితో గీతాంజలితో బాక్సింగ్‌లో ఓడిపోవటం సిగ్గుచేటు మీరు ఎందుకు ఓడిపోవలసివచ్చింది?

చందా నారాయణరావు, కొత్తగూడెం

**కింకాంగ్ లాంటి వస్తాదే దారాసింగ్ చేతుల్లో లాలోచిగా ఓడిపోతాడు అలాంటి కేసే నాది అయినా ప్రేమలో నెగ్గానుగా ఓడిపోతే నష్టమేం?**

ఈ జన్మలో ఎక్కువగా నవ్వితే మళ్లీ జన్మలో ఏడవాల్సి వస్తుందంటారు మరి మీరు

పి కరుణాకరరెడ్డి నెల్లూరు

**ఇంకో జన్మమూ లేదు, యింకో లోకమూ లేదు మీకు ఓపికున్నంత నవ్వండి ఏం ఫర్వాలేదు.**

మిమ్మల్ని ఎక్కడో చూసినట్లున్నాను ఎక్కడబ్బా ?

జె శోభాకుమారి, నిజామాబాద్

**ఎక్కడో చూడ్డం ఏవిటబ్బా? గోడం మీద పోస్టర్స్‌లో చూస్తున్నారు పత్రికలలో చూసున్నారు, సినిమా హాల్లో చూస్తున్నారు. యిప్పుడు జ్ఞాపకం వచ్చిందా అబ్బా!**

మిమ్మల్ని చూస్తే మాకెప్పుడూ నవ్వు వస్తుంది మమ్మల్ని చూస్తే మీకు ఎలావుటుంది?

కామారి రాజేందర్, గుడివాడ

**భయమూ, భక్తి రెండు కలసి వుంటాయ్.**

ఈ దేవుడున్నాడు చూడూ, అన్ని కష్టాలు ఆడవాళ్లకే ఎందుకుపెట్టాడు? ఆడవారు ఆడపిల్లల్ని కనాలి ఇక మగవారు మగపిల్లల్ని కనేటట్లు పెడితే బాగుండేదేమో, ఏమంటారు?

పి వై పద్మారావు, మంచిర్యాల

**అమ్మ బాబోయ్! కనేపని మాకొద్దు మావల్ల కదు**

మనదేశం ప్రపంచ జనాభాలో ద్వితీయస్థానం ఆక్రమించింది అల ఆక్రమి చడానికి కారణమేమిటో కాస్త చెపుతారా?

పి చక్రధర్, హైదరాబాద్.

**వద్దు మొర్రో అన్నా! పిల్లలు క్యార్ క్యార్‌మని వస్తుంటే యింకా కారణమడుగుతారేమిటి?**

కుటుంబనియంత్రణ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

వి సరోజిని, వర్ని

**ఏమి అనుకోవద్దు మీకు వివాహమయిందా? ఒకవేళ అయితే రెండు మొగ, ఒక ఆడ ఉత్తమ మంటాను. ఎక్కువయితే డేంజర్.**

సినిమాల్లో నాయకీనాయకులు ఫస్టుక్లాసులోనే (యూనివర్సిటీ అంతటికి) పాసవుతారు ఎందుకు?

కంచి శేషగిరి, అనంతపురం,



**అలా పాసైతేనే నాయకీనాయకులనిపించుకుంటారు, లేకుంటే నాలాంటి బడుద్ధాయిలే (సినిమాల్లో)**

మీ జీవిత చరిత్రను తెలిపే పుస్తకం ఎందుక రాలేదు?

యానంబాక సీతాలక్ష్మి, అనంతపురం

**చరిత్రను తెలిపేంత జీవితం నాకు లేదు కాబట్టి.**

విద్యుద్రథలో మీరు ఏవిధమైన కలలు కంటారు?

బి. ప్రకాష్, కాకినాడ



**ఏవిధమైన యంత్రసాహాయం లేకుండా గాలిలో రయ్యమని ఎగిరి పోతున్నట్లు, అప్పుడప్పుడు కరెంటు పోల్స్ అడ్డొస్తే వాటిని తప్పించుకొని దూసుకొని పోతున్నట్లు, 50, 60 అంతస్తుల నుంచి సునాయసంగా కిందికి దూకుతున్నట్లు**

పెళ్లి చూపులకు పిల్లను చూడటానికి ఎప్పుడూ మగవాళ్లే వెళతారు అలా కాకుండా మగవాళ్లను చూడటానికి ఆడపిల్లలు వెళ్లరు ఎందుకు?

ఎ. వెంకటేశ్వరరావు, పూనా

**ఆడపిల్లలకు సిగ్గయ్యా? ఎలా వెళ్తారు? మగవాళ్ళు ముసుగు వేసుకుని ఛమక్, ఛమక్ మని సిగ్గు పడుతూ నడిచే రోజులు రానివ్వండి, మీ కోరిక నెరవేరుతుంది**

మన తెలుగు చిత్రాలలో విశేషంగా కనిపించే 'సెక్స్' పోజులనుచూస్తే మన సెన్సారుబోర్డు సభ్యులంతా మంచి శృంగార ప్రియులని నా అభిప్రాయం మీరేమంటారు?

టి. చిట్టిబాబు, విజయవాడ

**అయ్యో చిట్టిబాబూ! మన సినిమాల్లో చూసే సెక్సు ఒక సెక్సా? యింగ్లీషు పిక్చర్ ఝుంఘీజ్ ఖాన్ చిత్రం చూడండి అదిరిపోతారు, సెక్సు అంటే అది**

మన ప్రధానమంత్రికి గాయాలు ఇతర మంత్రులకు ప్రమాదాలు జరిగాయి ఎందుకు?

కాజ వెంకటలలిత, విజయవాడ

**యికమీదైన ప్రభుత్వం జాగ్రత్తగా వుండాలని కొద్దిగా వడ్డించి వుంచారు**

సినిమా పరిశ్రమను జాతీయం చేస్తే — మీరు గెజెటెడ్ ఆఫీసరవుతారా లేక నాన్ గెజెటెడ్ ఆఫీసరవుతారా?

కె. వీరభద్రశాస్త్రి, రామవరప్పాడు

**ఏది దొరికితే అది అవుతాను**

సెన్సారు కత్తెరపడ్డ మన ఫిల్ము (సెక్స్) నంతటినీ కలిపి పేరుపెట్టి విదేశాలకు ఎంపిస్తే— మనకి కావలసినంత విదేశ మారకద్రవ్యం వస్తుంది కదండీ? ఎలావుంది మన ఐడియా?

జయప్రకాష్, శ్రీకాకుళం

**మీ ఐడియా ఏం బాగాలేదు అలా చేసేబదులు కూలిపని చేసుకుని క్రిష్ణా! రామా! అని గంజి త్రాగి బ్రతకడం మేలు**

కుక్కకాటుకి చెప్పుదెబ్బ అన్నారు పెద్దలు మరి మీ ప్రేమకాటుకి?

వి. లక్ష్మీరాజారాం, కరీంనగర్



**చెంపదెబ్బ**

సినిమాల్లో పెళ్లిళ్లకీ మామూలు పెళ్లిళ్లకీ తేడా ఏమిటండీ?

పి. పి. హాపాత్రో, బరంపురం

## బహుమతిపొందిన ప్రశ్న

సాధారణంగా సాంఘిక చిత్రాల్లో జమీందారు కొడుక్కి యే సామాన్య స్త్రీనో — జమీందారు కూతుర్ని యే సామాన్య మానవుడికో ముడి పెడుతూంటారు ఎందుకు?

బి. గురుదాసు, విశాఖపట్నం



**కుల మత భేదాలు, పేదా గొప్ప అనే తేడా లేకుండా అందరూ ఈ సమాజంలో సమానులే అని నిరూపించడానికి**



**సినిమాల్లో పెళ్ళిళ్ళు టెంపరరీ మామూలు పెళ్ళిళ్ళు పర్మనెంట్**

పద్మనాభం

# చిత్రలహరి

విజయవర్ధన్ కంబైన్స్‌వారు ''ఉపాయంలో అపాయం'' అనే చిత్రాన్ని గతనెల 26న వాహినిలోని మొదటి ఫ్లోర్‌లో ప్రారంభించారు. క్విక్ మూవీస్ నిర్మాణంలో సిద్ధహస్తులయిన దర్శక నిర్మాత శ్రీ బి విఠలాచార్య క్లాప్ కొట్టారు. పూర్ణా పిక్చర్స్ అధినేత శ్రీ కామరాజు కెమెరా స్విచ్ ఆన్ చేశారు. మొదటి షాట్ తిరుపతి వెంకటేశ్వరస్వామి విజయనిర్మలపై తీశారు. కృష్ణ, రామకృష్ణ, రామ్మోహన్, రాజబాబు, గీతాంజలి, కె. వి. చలం మున్నగువారు నటిస్తున్నారు. సంభాషణలు సముద్రాల జూనియర్, సంగీతం: మహదేవన్, కళ: తోట, కెమెరా: ఎం. కె. రాజు,



పుట్టింటిలో చుక్క (విజయ నిర్మల) పుట్టినరోజు. దర్శకుడు బాపు, కెమెరామన్ సెల్వరాజు, కృష్ణ, విజయలలిత కేక్ కట్ చేస్తున్న చుక్క (విజయ నిర్మల) —ఫొటో రూప

అసోసియేట్ డైరెక్టర్ కె వి రావు నిర్మాతలు సి వెంకురెడ్డి, ఏ రామిరెడ్డి, కూర్పు, దర్శకత్వం టి కృష్ణ

* * *

టి కృష్ణ ఒక చిత్రానికి దర్శకత్వం వహించటం యిదే మొదటిసారి. ఫిల్మ్ ఎడిటింగ్‌లో చక్కని నైపుణ్యమూ ఎంతో అనుభవమూ సంపాదించిన యువకుడు. ప్రసిద్ధ దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావుగారు పనిచేసిన చిత్రాలన్నిటికీ దాదాపు కృష్ణ అసోసియేట్‌గా పనిచేసి దర్శకత్వపు శాఖలో కూడా విశేషమయిన అనుభవం, పేర్పు గడించారు. ఇటీవల విడుదలై విజయవంతంగా పోగుతున్న ప్రసాద్ ప్రొడక్షన్స్‌వారి హిందీ వర్ణ చిత్రం మిలన్‌కి కృష్ణ అసోసియేట్ డైరెక్టర్‌గా ఎడిటర్‌గా పనిచేశారు

* * *

తేనెమనసులు చిత్రం ద్వారా ప్రేక్షకులకు పరిచయమై, కన్నెమనసులు, ఇద్దరు మొనగాళ్ళు చిత్రాల ద్వారా చక్కని నటిగా పేరు తెచ్చుకున్న కుమారి సంధ్యారాణి యిపుడు శ్రీ ప్రొడక్షన్స్‌వారి సాంఘికంలోను, టైగర్ ప్రొడక్షన్స్‌వారి మూడవ చిత్రంలోను మంచి భూమికలు పోషిస్తున్నది. అంతేకాదు, ప్రస్తుతం ఆమె హిందీ తమిళ చిత్రాలలో కూడ నటిస్తున్నది. అజంతా ఆర్ట్స్ (సునీల్‌దత్‌సంస్థ) హిందీ చిత్రంలోనూ కరుణాప్రసాద్ మూవీస్‌వారి తమిళ చిత్రంలోను నటించేందుకు యీ మధ్యనే ఒప్పందం జరిగింది. హిందీ చిత్రానికి ఆదుర్తి, తమిళ చిత్రానికి పి మాధవన్ దర్శకులు

* * *

సూర్యచిత్ర అనే క్రొత్తసంస్థ తెలుగులో ఒక చక్కని సాంఘిక చిత్రాన్ని నిర్మించనున్నది. జమున, హరనాథ్, పద్మనాభం ముఖ్యభూమికలు పోషిస్తారు. సంభాషణలు సదాశివబ్రహ్మం, సంగీతం ఎం ఎస్ శ్రీరామ్, దర్శకుడు మానాపురం అప్పారావు, నిర్మాతలు ఎం ఎస్ శ్రీరామ్, కె నాగేశ్వరరావు. ఈ చిత్రం షూటింగ్ ఏప్రిల్ 16 నుంచి వీనస్ స్టూడియోలో జరుగుతుంది

* * *

గతవారం శ్రీ అక్కినేని నాగేశ్వరరావు మద్రాసు వచ్చారు. అన్నపూర్ణావారి కార్యాలయంలో ఆయన్ని కలిశాను. ఎంతో ఉషారుగా కనిపించారు. అప్పుడే కాదు ఎప్పుడూ ఆయన ఉత్సాహంగానే వుంటారు. సరదాగా మాట్లాడుతారు. నాగేశ్వరరావు సినిమారంగంలోని లోతుపాతులను తెలుసుకున్నట్లే మిగిలిన రంగాల్లోని విషయాలను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్న వ్యక్తి. మంచి నటుడిగా వుంటూనే తన జీవితాన్ని ఎంతో విస్తృత పరచుకున్నారాయన. పారిశ్రామిక రంగంలోకి ప్రవేశించారు. అన్నపూర్ణా పల్వరైజింగ్ మిల్స్ స్థాపించారు. అన్నపూర్ణా ప్రొడక్ట్స్ పేరిట కాస్మెటిక్స్ కొన్ని విడుదల కాబోతున్నవి త్వరలో. వాటితో ముందుగా క్రౌనా అనే షాంపూ, ఐబ్రౌన్ క్లీనింగ్ పౌడర్‌గా విడుదల అవుతవి. అంతేకాదు టేబుల్స్ షూస్ ఫ్లోరింగ్ అన్నిటినీ శుభ్రపరుస్తుందట అప్లైవ్

* * *

"ఏమిటి విశేషాలు?" అన్నారు ఆయన. చేతికి కట్టు ఏదో వున్నట్లు కనిపించింది. అదే అడిగాను. 'ఏమిటని రహస్యం' చిత్రం షూటింగ్‌లో యుద్ధం చేస్తున్నప్పుడు కత్తి తగిలి చీరిందట. బొటనవేలికి చూపుడు వేలికీ మధ్యగా కత్తి జారి చీరింది. విశాలో మాట్లాడుతూ ఉంటే కాస్త టెన్షన్‌గా వుంది. అంత నొప్పి తెలీడంలేదు అన్నారు నాగేశ్వరరావు నవ్వుతూ. అక్కినేని ఆదర్శ కంప చక్రవర్తి చిత్ర సంస్థ స్థాపించారు. తెలుగు చలనచిత్ర పరిశ్రమలో ఈ ఆరంభం కలయిక అపూర్వమే!

* * *

ఏ వి యం వారు నిర్మించబోయే రెండు కొత్త తెలుగు చిత్రాల్లో నటించేందుకు అంగీకరించటం జరిగిందని నాగేశ్వరరావు చెప్పారు. రెండింటిలోను ఒకటి నలుపు తెలుపుల్లోను మరొకటి రంగుల్లోను నిర్మించబడుతుంది. నలుపు తెలుపుల్లో నిర్మించే చిత్రం జూన్‌లోను, వర్ణచిత్రం వచ్చే జనవరిలోను ఆరంభించగలరని ఆయన తెలిపారు. నాగేశ్వరరావు నటించిన కొత్త చిత్రం పద్మశ్రీ వారి 'ప్రాణమిత్రులు' నిర్మాణం పూర్తి అయి



మితమైన ధర



# మొటిమెలు మీకు మీ వివాహానికి మధ్య అవరోధకం కాగూడదు

నిటాల్ ఔషధయుక్త పింపుల్ క్రీమ్ వాడండి మరి వాటిని నిర్మూలించుకోండి

మీరు కూడ అందమైన వధువు కాగలరు. మిమ్ములను బాధించుచున్న మొటిమెలు మరియు నల్ల పొక్కులు మచ్చ మాసి పోయిన ప్రకాశమాన నున్నటి చర్మమును కలిగియుందురు. నిటాల్ ఔషధయుక్త పింపుల్ క్రీమ్‌ను 7 రోజులు వాడండి అంతే. ఇంక చూడండి మీ ముఖము మొటిమెలు, నల్లపొక్కులు మరియు ఇతర దద్దుర్లు వంటివి లేకుండా నున్నగా వుంటుంది. మచ్చలుగాని లేక పొడలుగాని ఏర్పడవు; చర్మ అంతర్గత నిర్మాణమును ఆరోగ్యవంతమొనర్చి చర్మమును బలిష్టంగాను ప్రకాశమానంగాను వుంచును. నిటాల్ యొక్క క్రిమినిరోధక సూత్రమును డాక్టర్లు ఎక్కువగా సిఫారసు చేసియున్నారు. అది మనోహరంగా పరిమళమొనర్చబడి బాలికలకు బాలురకు కూడ ఉద్దేశింపబడినది.

వాడే విధము—పాకెట్‌లో వున్నది





**Nital**

**MEDICATED PIMPLE CREAM**

నిటాల్ మొటిమెల మందు



**7** రోజుల మొటిమెల చికిత్స.

నిర్మాతలు కొచ్చిన్ ఫామ్ ప్రైవేట్ లిమిటెడ్, నవరత్న హౌస్, మంత్ర రోడ్. కొచ్చిన్-2.
మద్రాస్ ఆంధ్రప్రదేశ్ మైసూర్ అండ్ కేరళ రాష్ట్రములకు డిస్ట్రిబ్యూటర్లు:
గణపతి అండ్ కం. 103-104, లింగి చెట్టి స్ట్రీట్, పోస్టు బాక్సు నం. 1986, మద్రాస్ 1.

ప్రఖ్యాత కెమిస్టులందరి వద్ద లభించును

శీఘ్రగతింగా జరుపుకొంటున్నది. దీని తర్వాత "పూలరంగడు" వస్తుంది.

* * *

హైదరాబాద్ నుంచి నాగేశ్వరరావు, మధుసూదనరావు కలిసి వచ్చారుట. తర్వాత మధుసూదనరావు గారిని కలిశాను. పూలరంగడు చిత్రం యిన్‌డోర్‌లో ఒకపాట, అవుట్‌డోర్ వర్క్ మాత్రం మిగిలి వున్న దనీ, ఈ నెల రెండవ భాగానికి చిత్ర నిర్మాణం పూర్తి కాగలదనీ చెప్పారాయన. ముళ్లపూడి వెంకటరమణ రాసిన యీ చిత్ర కథకు ముప్పాళ రంగనాయకమ్మ సంభాషణలు సమకూర్చారు. నాగేశ్వరరావు, జమున, విజయనిర్మల, శోభన్‌బాబు, పద్మనాభం, చలం, గీతాంజలి, రాధాకుమారి ముఖ్య భూమికలు పోషిస్తున్నారు. సెల్వరాజ్ ఛాయాగ్రహణమూ, రాజేశ్వరరావు సంగీత దర్శకత్వమూ నిర్వహిస్తున్న యీ చిత్రానికి దర్శకుడు ఆదుర్తి.

* * *

ఆదుర్తి డార్జిలింగ్ వెళ్లారు, ఏప్రిల్ 2 న. ప్రసిద్ధ హిందీ నటుడు సునీల్‌దత్ తన స్వంత సంస్థ అజంతా ఆర్ట్స్ పేర హిందీలో ఒక వర్ణ చిత్రం నిర్మిస్తున్నారు. దీనికి ఆదుర్తి దర్శకత్వం వహిస్తున్నారు. బెంగుళూర్‌కు చెందిన 'లీనా' అనే కన్నె యిందులో కథానాయిక. సునీల్‌దత్ తమ్ముడు సోమ్‌దత్ నాయకుడు. తెలుగు తార సంధ్యారాణి కూడా దీన్లో ఒక ముఖ్య పాత్ర ధరిస్తున్నది. ఈ చిత్రం అవుట్‌డోర్ షూటింగ్ జరుగుతున్నదిపుడు. అందునిమిత్తమే ఆదుర్తి డార్జిలింగ్

## చిత్రలహరి



'ప్రాణమిత్రులు'లో గీతాంజలి, జగ్గయ్య.

వెళ్లారు. అవుట్‌డోర్‌లో పని పూర్తి చేసుకుని తిరిగి వచ్చేనెల మొదటివారంలో మద్రాసు వస్తారు.

* * *

'మిలన్' చిత్రం విడుదలానంతరం ఉత్తరభారతదేశంలో కూడా దర్శకుడుగా శ్రీ ఆదుర్తికి మంచి పేరు వచ్చింది. జూన్, జూలైలలో బెర్లిన్‌లో జరుగబోయే అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి 'మిలన్' పంపబడుతున్నదని ఒకవార్త! ఆంధ్రదేశపు అందాలను, గోదావరి జలాలను, జర్మనీకి చూపిస్తున్న శ్రీ ఆదుర్తి అభినందనీయులు.

* * *

"ఇది సినిమా తారల పెళ్ళిళ్ళ సీజన్‌లా ఉందే!" అన్నాడో మిత్రుడు. యీమధ్య చూడగా అలానే కనిపిస్తున్నది. మార్చి 1[?] బి. సరోజాదేవి వివాహం జరిగింది. ఈనెల 20 న ఎల్. విజయలక్ష్మి వివాహం జరుగబోతున్నది. ఈ సంవత్సరం తారల వివాహాల లిస్టులో మరో ప్రసిద్ధ తార పేరు కూడా వినిపిస్తున్నది. ఆ వివాహాలన్నీ త్వరలో ప్రకటించబడగలవని తెలుస్తున్నది.

* * *

తారకరామా పిక్చర్స్ వారి "శ్రీకృష్ణావతారం" చిత్రం గత నెలలో మేజర్ షెడ్యూల్‌లో పని జరిగింది. ఇందులో అష్టమహిషి కళ్యాణం, శ్రీకృష్ణుడు (యన్. టి. రామారావు) కుచేలుడి అష్టభార్యలతో అర్ఘ్య మివ్వడం మున్నగు దృశ్యాలను చిత్రీకరించారు. కృష్ణుని అష్టభార్యలుగా దేవిక, కాంచన, కృష్ణకుమారి, ఎల్. విజయలక్ష్మి, గీతాంజలి, సంధ్యారాణి, సుకన్య, పద్మజ నటిస్తున్నారు. ఈ నెలలో మరొక పెద్ద షెడ్యూల దుర్యోధనుని (సత్యనారాయణ) దర్బారులో వర్క్ చేస్తారు. దీనితో యీ చిత్ర నిర్మాణం పూర్తి అవుతుంది. దర్శకుడు: కమలాకర కామేశ్వరరావు, రచన: సముద్రాల, సంగీతం: టి. వి. రాజు, నిర్మాత: అట్లూరి పుండరీకాక్షయ్య.

— మోహన్‌కుమార్

"గదే అటగో! ఆడ సూడు సిన్నగ కంటి బడ్తుంది, ఆడికెల్లి ఒకడు సప్పట్లు కొడ్తున్నడు. ఈడ కూకున్న రాంకిన బడ్తది. ఎరకైందా?"

అగో, ఆ రెండు గోపురాల భవంతులు, తారామతి, ప్రేమామతి అనే రాజ సానులది.' ఆడ కూకొని రాజా సప్పట్లు సరిస్తె అతికినపడి ఈడికొచ్చి తైతక్కలాడ్తది.

"అవల సెరువు ఉసేన్‌సాగరా? "అడిగిండు ఎంకి.

"కాదన్నా అది గండిపేట. పట్నంల నీళ్లు ఇండ్లకెల్లే తాగుతరు. ఆ పక్క సూసినావ్ అది ఇమాయిత్ సాగర్."

మరి కింద కంటబడ్తున్న ఆ సిన్న భవంతులేందో?'

"అవ్వి మిలిట్రోళ్లుండేవి. ఈడ సైన్యంల సేరినోళ్లందరు ఎట్ల యుద్ధం సేయాలో నేర్సుకొంటరు."

ఇద్దరు కిందికొంగబడి ఖుషీగా సూడబట్టిండ్రు.

ఇంతల పైకి కొందరు తెల్లదొరలొచ్చిండ్రు. ఆరి ఎంటికలు ముసలోలకైనట్టు తెల్లగున్నయ్. కొందరి కండ్లు రాగెంటికలున్నయ్. ఆరి గుడ్లేమొ నీలంగున్నై. ఆరేందో బాసల మాట్లాడబట్టిండ్రు.

ఎంకిగాడు రామిగాడ్ని జర్రంత పక్కకు పిలిసి "ఇగో అంద్ల మొగోల్లా ఆడోరూ, అందరూ మొగోరేనా? "అన్నడు ముక్కునే లేసుకొంట.

"ఏహె కాదులె అంద్ల ఆడోరు భీ వున్నరు. ఆరు భీ సొక్కలాగులే ఏసుకొంటరు."

"నీ కెట్ల తెల్సురా రామీ?'

"ఆడోరు మూతికి ఎర్రరంగేసుకొంటరు. ఆరికి గిరజాల జుట్టుంటది." ఇద్దరిగ ఆడికెల్లి కిందికి పోదామనుకున్నరు.

ఇద్దరు అనేకం ఇంతల్ని ! ఇసుకొంట నడవబట్టిండ్రు.

కుడేపున్న సిన్న సందు గుండ దిగబట్టిండ్రు. ఈడికెల్లె రాజా రోజొచ్చెటోడంట! జర్ర ముందుకు దిగినాంక మంచినీళ్ల బావి సూపిండు రామి. గోడల మీన మంచినీళ్ల గొట్టంభీ సూపిండు.

"ఇయన్ని నీకెట్ల తెల్సురా రామి?" అనడిగిండెంకగాడు.

"గదంతలే" అన్నడాడు మీసాలు తిప్పకొంట,

# ఎంకిగాడు పట్నం...

(29-వ పేజీ తరువాయి)

ఇద్దరూ ఇగ దిగి జనాన్లకొచ్చిండ్రు. ఈడ జనానుండెడిది," అన్నడు రామి.

"జనానంటె ఆడోరు గద? అడిగిండెంకి.

"జౌనే" అన్నడాడు.

"గీ బావెందు కన్నా?" అడిగిండు ఎంకి.

"గిదా? గిది రాజాగారును దుష్మనులు, గదే సత్రువులు పట్టుకుంటె ఈడ అయున పెళ్లాంలందరు గీ బావిల దూకి సచ్చెటోరంట. ఇగ ఆ ముందుగాల వున్నది సూపినావ్ అడ నిలబడి నీ వొర్లితె మల్లీ ఆడికెల్లి ఇనబడ్తది. సూప్తన్దా" అని ఎంకిగాడ్ని ముందుకు గుంజకపోయిండు.

"ఈడ నిలబడి పెద్దంగ ఒర్లు" అన్నడు రామి.

"ఓరి రామిగో" అర్సిండెంకి.

జర్రాగి నాంకిన బడ్డది ఓరి రామిగో.

"ఓర్ని అక్క నిజమేరో." అన్నడు ఎంకి గుడ్లెల్లబెట్టి.

ఆడికెల్లి నడుస్త తుపాకులున్న భవంతులు సూస్కొని బైటబడిండ్రు.

ఇగ బైటికి రాంగనే రిచ్చోల్లెంబడి తగలబట్టిండ్రు, "గండిపేట్ తీస్కపోవాలె? తీన్ రూపాయ్ ఇస్తావ్?

ఎంకిగాడి గుడ్లు వచ్చుబడినై.

"రామీ పైకెల్లే గండిపేట్ సూసినం గద, ఇగ ఇంటికి పోదాం పద."

"గట్లనే కానియరాదు." అన్నడు రామి.

ఇగ ఇద్దరు బస్సుకాడికి నడిసిండ్రు.

బస్సుల జనం అప్పటికే నిండిండ్రు. ఇగ ఇద్దరూ కూడ నిలబడిండ్రు. గివ్వేమొ బక్క బస్సులాయ్. సర్కారోరి బస్సులైతె లావుగుంటై యని ఎరకపర్సిండు రామి. జర్ర టేమ్ బిలాయించినాంక బస్సు "డుర్ మని ఒక్కసారి ముందుకురికింది. ఎంకిగాడు కిందికి మీదికై ఎనక కూకొని నిద్దర్లున్నవ్వ మీన దబ్బున కూలిండు. ఆ అవ్వ 'గయ్‌న' లేసింది.

"కళ్లుపొరలు కమ్మినాయ్‌రా? వాడి చెట్టంతోడివి ఆడకూతురుమీద పడ్తావ్‌ర? నీకు అక్కలవ్వా లేర్ర?'

ఓ అవ్వో మా ఓడు మొన్ననే వూరికెల్లి వచ్చిండు. ఆడికేం తెలవదూ, పోనిదాదు?"

ఇగ ఎంకిగాడు భయంల పైసలెన్ని సీకుర్ని గట్టిగ పట్టుకొన్నాడు.

బస్సు కదిలింది, పట్నం పోయిగ.

'కార్వాన్' కాడ దిగే దాక ఆ అవ్వ బూతులు తిడ్తనేపోయింది.

సవ్వపూలు కాడ బస్సుదిగి సోలిబండ పోయి నడిసిండ్రిద్దరు. ఇద్దరు ఇంటికి జేరంగనె అన్నం దిని నిద్రపోయిండ్రు.

* * *

పొద్దుకూకే ఏలకు లేచిండెంకిగాడు సల్లని నీల్లతో మొహం గొట్టు కడుగి పైకం లెక్కబెట్టిండు.

"ఓరి రామిగో", అనర్సిండు లెక్కసూసి

"ఏందే అన్నా?

"అరే పైకమ్మొపోయింద్రా, నాగికేం కొనలేదింక, అన్నడు లాల్‌మూతి సేస్కొని

లేదన్నా, పట్నమంటె వూకెతీదా? పోని పదిరూపాల రైలు తిక్కటికుంచుకో, ఇంకో పది పెట్టి పశువులుండే జూ సూసొద్దాం."

"ఏహె గదేం సూస్తం మా సొన్నదంట్ల పాలెంల ఎన్ని గొడ్లంటున్నై ఇకేం సూడాలె"అన్నడాడు ఏడ్సు గొంతులో.

"కాదులె సూస్తెగాని తెలవదు నీకు"

ఇగెంకిగాడి కూకోక తప్పలేదు.

ఆ రెయ్యి ఎంకన్నకు నిద్దరేపట్టలేదు రెయ్యంత కలల నాగివచ్చి, 'మావా, నాకు సీరలు తెత్తావె?' అన్నది. ఆరెయ్యంత నాగితోనే ఉన్నడు ఎంకి కలల.

ఇగ తెల్లారి గట్ల కేసి సళ్లు తోమ్కొని సాయ్ గిట్ల తాగి తానం గిట్ల సేస్కొని. సద్ది తిని, రామిగాడి రిచ్చల కూకొని జూ సాయ్ బైలెల్లిండు.

"రామీ గిదేంద్రా గుడి లెక్కున్నది?" అనడిగిండు ఎంకిగాడు దార్ల.

"ఒనే, గిది గుడి లాగుండేదే! ఈడ నాయం సెప్తరు. దీన్ని హైకోర్టంటరు.

రిచ్చ మలుపులు తిరుగ్తాపోయింది!

ఇగ సాన దూరం పోయినాంక ఒక పెద్ద దరవాజ ముందాపిండు రామిగాడు. ఎంకిగాడు దిగినాక రిచ్చనోకాడికి దీస్కబోయి ఒకాయనకు రిచ్చాయిచ్చి అట్టముక్క తెచ్చిండు.

"గదేంద్రో రిచ్చనిచ్చి అట్టముకలె తెత్తవ్?" అనడిగిండు ఎంకి.

"గదంతలె మల్ల అట్టముక్క సూపితె మన రిచ్చ మనకు వాపసిస్తరు. ఆ! పైకమెందిరా?" అడిగిండు రామిగాడు.

ఇగ ఇనుక్కుంట ఎంకిగాడు బొడ్లకెల్లి పైకం తీసి రామిగాడికిచ్చేట్టిండు.

ఇద్దరిగ టిక్కెటు కొని లోపలికి బోయింండ్రు.

లోపలి కెల్లంగనె ఎంకిగాడు తంగైండు.

ఆడెన్ని రంగు పూల సెట్లున్నయ్? దారి పొంటి ఇటు అటూ రంగురంగుల పిలకలున్నయ్! ఇగెంతమంది జనం! మంద లకు మందిలే! లోపలికి మర బండ్లు భీ వస్తున్నయ్.

ఎడమసేతేపు ఎల్తె ఆడ ఎన్నిరకాల, జంతువులున్నై గుండె ప్యారాన్నైంది. నీటి పంది, ముళ్లపంది, దుప్పి, ఏనుగు, సింగం, పెద్దపులి, గుడ్డేలుగు, కోతులు, కొండ ముచ్చుల, తాబేలు, పాములు రంగుల పిట్టలు, కొత్త జంతువులు రంగురంగుల చీరల మడుసులు....?!!

అన్ని సూసినాంక ఎంకిగాడు యుగ, మీన పేము పెట్టి— రామిగా! లోకం లన్ని గొడ్లుంటాయిర?'' అన్నడు.

''మరేమనుకొన్నవ్? ఇంక సూస్తవ్ రా?'' అని ఇంక ముందుకు దీస్కపోయిండు.

ఇగ జర్ర ముందుకు పొంగనె ఆడ తోట యమగున్నది! తిరిగి తిరిగి రామి ఎంకి, ఒకాడ రాయి మీన కూకున్నరు.

జర్రాగి ఎంకిగాడు కాలువడ్డు రానీకు బోయిండు. జర్ర దూరం పోంగనె గుబురు గున్న సెట్లు కనుపించినై, అడికెల్లి సూకబోయిండు.

రేడ్యో నేను విన్న మనపోరా ప్రేమి స్తున్నా! యాడికెల్లో మాట వినబడింది. ఎంకిగాడు మెల్లగ లేసి సెట్ల గుబురును పక్కకు జరిపి సూసిండు.

ఎవరో ఇద్దరు వయసోళ్లు. అండ్ల ఒకరు మొగ, ఒకరు ఆడ. మొగాయన ఆడమడిసి తొడ మీన తలపెట్టి మాట్లా డుతున్నడు. ఆమె కూకొని ఆయన తల జుట్టుల యెల్ల పెట్టి మాట్లాడు తున్నది.

నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను జాకబ్ మరి నూ వొదిలిపెట్టుకోవాలిగా?

ఎంకిగాడికి జంట జర్ర ముచ్చటి గనిపించింది.

''మీ అయ్యలొప్పుకుంటే నేనొప్పు తాగా! యమగుంది మీ జంట.'' అన్నాడు జర్రంత ఖుషై''

ఆ మనుమడిసి గబుక్కున లేసి ఎంకి గాడ్ని సూసి కోపంగ లేచి మనోడి కాడి కొచ్చిండు.

''మేం ప్రేమించుకొంటె సూస్తా పురా బ్రూట్'' అని ఒక సెంపదెబ్బ పెట్టి పొయిండు.

ఎంకిగాడు సెంపమీలొత్తుకుంట రామి గాడి కొచ్చి సెప్పిండు.

''గట్ల మాడకూడదే మావ?'' అన్న డాడు జర్ర గభరాయించి. ఇగ ఆడనే వున్న గడ్డి మీన పల్లగ నీడుంటె పడు వాల్చిండెంకిగాడు.

మెల్లగ నిద్రబట్టింది.

కలల ఎర్రసీర గట్టిన సిన్నది ఎగురు కనబడింది. ఎర్ర సీర దొరసాని, ఎర్ర పెదాల పిట్ట అబ్బ పిట్టని వాటేస్కొ బోయి పక్కకొరిగిండు. ప్రక్కనున్న నీటి గుంటల ధభీమని పడ్డడు ఎంకిగాడు.

శబ్దం కాంగనే పక్కకు సూసిండు రామి.

ఎంకిగాడు నీళ్లల్లో పడి చేతులు కాళ్లు కొట్టుకుంట

''రా నయ్యాల!'' రా! అరవబట్టిండు.

''ఎంకన్నో లే! నీళ్లల బడి కొటుకు లాడ్తవ్? అని అర్సినా హోష్ లేకుండ బోయింది. ఇగ లాభం లేదని ఎంకిగాడి తల్ల నీల్లల్ల ముంచిండు. జర్ర సేపటకి మెల్లగ కల్లు తెర్సిండు. ఎంకిగాడు, పెయ్యంత మన్నంటింది. జరసేపటికి జరి గింది సెప్పిండు రామిగాడు. ఎంకిగాడు నవ్వి తన కొచ్చిన కల గూర్సి రామిగాని కెరకపర్సిండు.

ఇద్దరు మెల్లగ నడుస్త బైటకొచ్చింండ్రు ఎంకిగాడ్ని రిచ్చల కూకుండ జెట్టుకొని ఇంటి పొంగ రిచ్చని నడిపిండు రామి.

ఇంటికొచ్చి అన్నం దిని మంచం మీన కూకునంగనె నిద్ర పట్టిందెంకిగాడికి. నిద్రల బాగ జరం కూడొచ్చింది. నిద్రలనే అరవ సురూజేసిండు. ''ఓసి నాగో వస్తినే, ఈ మాయదారి పట్నం కోసం నిన్నొదిలొనే నాగో!'' అని అరవ బట్టిండు. మూరత్త ఇంతల కసాయం కాసి ఆడి నోట్ల బోసింది. రాత్రంత అరిసిఅరిసి తెల్లారి జర్రంత కునుకు బట్టింది. ఎంకిగాడికి.

* * *

తెల్లారిటాలికి జర్ర జరం తగ్గింది ఎంకిగాడికి.

లేవంగనే మొహం కడిగి ముల్లె కట్టు కొని వస్త రామిగా! అత్తో వస్తా'' అన ర్సిండు.

''ఇపుడేం పోతవ్? నిన్న రెయ్య పెయ్య ఏడెక్కింది. పైత్తం మూటలింక తగ్గ లేదు, ఈపుటుండు ఎంకి!'' అన్నదత్త.

''లేదత్త పోవాలె'' ని మొండేస్కొని కూకు న్నడు.

ఇగ లాభం లేదని ఎంకిగాడ్ని రిచ్చల కూకొపెట్టుకొని రైలు స్టేషనికి తీస్క బోయిండు.

రైలు కదిలేముందడిగిండు రామి— ''మల్లెప్పుడొస్తవ్ ఎంకిగా?''

''ఇగేడికి రాన్రో'' అన్నడు గొంగడి ఇంక నిండ కప్పుకొంట.

రైలు బైలెల్లింది.

రైలు పట్నం దాటి పొలం మద్యల పడి పురకబట్టింది. ఇంతల తెల్లకోటు



దొంగొచ్చింది.

ఆయున్ని సూడంగనె ఎంకిగాడు, టిక్కెటి తీసిచ్చిండు.

అటూసేసిటూసేసి గాలికి రైలు సొప్ప



# ఎంకిగాడు పట్నం...

దంట్ల పాలానికి సీకటి పడేటాలకి సేరుకున్నది.

స్టేసన్ల దిగి సెయ్యిరిచి ఎంకిగాడు పాలెం సొంయిగ నడవబట్టిండు—తలనిండ గొంగడి కప్పుకొని.

"మావో!" యూడికెల్లో నాగి గొంతు ఇనబడింది.

ఎంకిగాడి గుండెల్ల రాయిపడింది. జర జల్ది నడవబట్టిండు. ఎనకకెల్లి నాగి గడ్డిమోపు మోస్తువురుక్కొంట ఎంకిగాడి కాడికొచ్చింది.

"మావా! పట్నం సూసినావె?!"

"ఆ." అన్నడాడు గొంగడింక నిండ కప్పుకొంట.

నాకేం తెచ్చినవ్?" అంది నాగి.

"నెత్తిన గుడ్డేస్కొచ్చిన." అన్నడాడు ఏడ్పు మొహంపెట్టి.

"ఏహె!" అంది నాగి జర జల్ది నడుస్తు.

ఇద్దరూర్ల పడేటాల్కి జరజర సీకటి పడబట్టింది.

ఎంకిగాడు వూర్లె కాలు పెట్టంగనె వూర్ల పోల్లగాళ్లూ, పెద్దోళ్లూ, ఆడోళ్లూ అందరూ ఎంకిగాడ్ని సుట్టిండ్రు.

పోల్లగాల్లైతె ఎగరబట్టిండ్రు "ఎంకిగాడు పట్నం సూసిండు. "పెద్ద తాత అనబట్టిండు. "ఎంకిగా మాకేం తెచ్చినవ్!"

నాగి అరవ బట్టింది. "నా మాటేం సేసనవ్ మావో...?!"

ఇగ ఎంకిగాడు ఏడ్పు మొహం పెట్టి అన్నడు.

"ఇగో నా కాకలేస్తుంటె మీగోలేంది? అన్నడు. జర కోపమై.

నాగి అందర్నదిస్తుంది

"ఇగో మల్లమత్త, రామయ్య తాతా అంతా సావిడి కాడికెల్లి కూకోండి. నాలుగు లాంతర్లు గూడ తీస్కొని రండి. మా ఎంకి మావ అన్నం దినాడి కొస్తడు. అందరి మద్యల కూకొని పట్నంల సూసింది సెప్తడు." అంది.

ఇగ అందరు ఆర్లారు గుసగుసలాడు కొంట ఎల్లిపోయిండ్రు.

ఎంకిగాడి కన్నంపెట్టి వూరి మధ్యల సావిడి కాడికి గుంజాకపోయింది.

ఎంకిగాడు అరుగు మీద కూకున్నడు. సొప్పదంట్లపాలెం రాజులాగున్నడాడు. అందరొచ్చి కూకున్నాక ఎంకిగాడు సెప్ప సురూ జేసిండు.

"ఇగో బాగ ఇనండి నేనొక్కపాలె సెబుత" అన్నడాడు.

అందరు ఆడేపె సూడబట్టిండ్రు.

"నేను పట్నంల దిగంగనె నాకు రామిగాడు నా మెడల పూలదండేసిండు", అన్నడాడు. సుట్ట పొగ గుంజి మెల్లగ వదుల్త.

ఆడున్నందరు ముక్కునేలేసుకున్నారు.

"ఏరా ఎంకిగా రామిగాడికెట్ల తెల్సురా నె వచ్చినట్లు?" అన్నది సెన్నమ్మవ్వ.

"గదట్లనే తెలుస్తదిలే! అన్నడాడు.

"ఇగ ఆడికి జేరంగనె ఆడు నన్ను మర బండ్ల కూకొబెట్కొని పెద్ద సత్రంల దింపిండు. ఆడ ఏడాకుల అన్నం. పెట్టిండ్రు. రాత్రిల్లాడ వజ్రాలొలిగి పగటోలోలుగుంటయ్. ఆడ రాచ్చసులు కట్టిన భవంతులు శాన ఉన్నయ్.

"అయితె రావణాసురుడి ఇల్లు ఆడే వుందా?" అడిగింది లచ్చక్క.

"వుంది. ఇంటి ముందు ఆయన బొమ్మ రంగుల్లో వుంది. ఆయనందరికీ గుడ్డ మీద కనబడ్తడు.

పోలవ్వ గుడ్లు పెద్దగ సేసింది.

"ఒసి నాగో ఎంకిగాడికి దిష్టి తియ్యవే!" అంది యాదమ్మొదిన.

ఎంకిగాడు మీసాలు దిప్పుకొన్నడు.

"ఇగో ఎంకిగా ఈ పాలి ఎండల్ల అందరం పోదామ్రట పట్నం— సూస్నీకి?" అంది పోలవ్వ.

ఎంకిగాడు జరంత హైరానై లేచి ఇంటి సొయిగురుకబట్టిండు.

అందరు తంగై ఆడనే కూకున్నరు. ఆడెట్లెందుకు సేసిండో ఎవ్వరికీ ఇంత వరకు అంతుబట్టలేదు.

మరి ఇగో మీరెవరైనా సొప్పదంట్ల పాలెమెళ్లైతె ఎంకిగాడ్ని అడగండి. "ఏం ఎంకిగా, పట్నం సూసినావ్?" అడిగ ఉరికి పోతడు.

## అంకితం

అమాయకుడు, ఉత్సాహవంతుడైన మా ఎంకన్నకు ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.